


## ఈ రోజుల్లో తలనొప్పి అంటే
## మాటలా!

# సాలోఫేన్‌ను వాడండి.
# అమోఘంగా నొప్పులను నివారించే
# విశిష్టమైన మాత్ర.
# వెల అతిచౌక

మంచి నొప్పుల నివారిణి సాలోఫేన్‌ను గమనించండి. దీనిలో రెండు మందులు అమోఘంగా
నొప్పులను పోగొట్టేవి చేరివున్నాయి—ఆస్ప్రిన్, ఫెనాసిటిన్—అయినప్పటికీ
వెల మాత్రము 7 పైసలే ఒక మాత్ర. సాలోఫేన్ అతిశీఘ్రంగా,
తలనొప్పులకు జలుబులకు పండ్లనొప్పి. ఫ్లూ జ్వరాలకు
కండలనొప్పులకు ఉపశమనం కల్గిస్తుంది.

సాలోఫేన్ నొప్పుల నివారిణి మాత్రలు—ఏళ్లతరబడి
ఇంటింటా ప్రసిద్ధిపొందిన అమృతాంజన్
లిమిటెడ్ వారి తయారీ.

అమృతాంజన్ లిమిటెడ్ వారి నమ్మకమైన తయారీ

**సాలోఫేన్**
అమోఘమగు
నిరపాయకరమైన
నొప్పుల నివారిణి

SAA/AMS/2197 TEL

# ఇండూ భాగ్యమది: నిర్మలాకాశంలో విద్యుజ్జ్యోతి

సిల్వర్ నైట్రేట్ కాంతి చైతన్యంగా ఉంటుంది. కాబట్టి ఫిల్ము తయారీలో ఇది అత్యంత అవసరమైనది. ఇండూవారి సిల్వర్ నైట్రేట్ **99.99%** స్వచ్ఛమైనది! ఇదే ఇండూవారి ఫిల్ము విశిష్టతకు పూచీనిస్తుంది. ఇండూవారి ఈ సిల్వర్ నైట్రేట్ ప్లాంట్ అత్యంత ఉత్తమమైనది. దీనిని ఇండూ వారు తమ స్వంత సాంకేతిక విజ్ఞానులతో పూర్తిగా స్వదేశీయ సాధన సంపత్తులతో డిజైను గావించి నిర్వహిస్తున్నారు.




సిల్వర్ నైట్రేట్ యొక్క ఈ 99.99% స్వచ్ఛతను ఇండూవారు తమ స్వంత ఉద్యమాలతో సాధించారు.

కార్యతః ఇతర కంపెనీలన్నీ సిల్వర్ నైట్రేట్‌ను దిగుమతి చేసుకొంటాయి లేకపోతే కొనుక్కుంటాయి. ఏ కొద్ది ఫోటోగ్రాఫిక్ కంపెనీలకు మాత్రమే సిల్వర్ నైట్రేట్ తయారుచేసే ప్లాంటులు స్వంతంగా ఉన్నాయి. ఇండూవారు దేశీయ సాధన సంపత్తులతో తయారు చేయాలన్న దృఢ నిశ్చయం వారికి మంచి లాభాలను కలిగించింది.

ఇందుచేతనే దిగుమతులమీద విదేశీ మారకాల్లమీద ఇండూ అధికంగా ఆదాచేశారు.

**ఇండూ విశిష్టతకు ప్రామాణ్యత:**

ప్రసిద్ధిపొందిన ఫోటోగ్రాఫిక్ వ్యాపారస్థులు, ఫిల్ము తయారీదారులు సినిమాటోగ్రాఫరులు, రేడియాలజిస్టులు వీరందరుకూడా ఇండూనే అభిలషిస్తారనే విషయములోనే ఇండూవారి విశిష్టత విదితమవుతూంది. ఇది వారికి తెలుసు. నేడు, ఇండూ అంటే విశిష్టతకు పర్యాయ పదమని, అభివృద్ధి పరచబడిన విధానాలతో ప్రగతికరమైన సాంకేతిక విజ్ఞానంతో ఉత్పాదనలు ధారావాహం చేస్తున్నారు: ఇండూ ప్రగతిపథంలో ముందుకు సాగుతూంది.

**ఇండూ విశిష్టత ఎగుమతి:**

ఇంకా మీకు నిదర్శనం కావాలంటే, మేమో రహస్యం చెపుతాము. ఇండూ అతి త్వరలోనే సిల్వర్ నైట్రేట్‌ను పాశ్చాత్య దేశాలకు ఎగుమతి చేస్తారు. ఇది వారి ఫిల్ము తయారీకి వినియోగ మవుతుంది!

ఔను, నేడు, ఇండూవారు తమ ఫ్యాక్టరీలో తామే తయారుచేయగలుగుతున్నారు — అదీ ఎంతో ఉత్తమ రీతిలో. అందువల్లనే మంచి విశ్వాసంతో వీటి ఏమిటో చెప్పగలుగుతున్నారు.




## ఇండూ అంటే ఫిల్మ్ ఫోటో·సినీ·ఎక్స్‌రే

హిందూస్థాన్ ఫోటో ఫిల్మ్స్ మాన్యుఫ్యాక్చరింగ్ కంపెనీ లిమిటెడ్,
(భారతీయ ప్రభుత్వమువారు చేపట్టిన సంస్థ)
ఇండూనగర్ ఊటకమండ్ 643 005.

లోకం పోకడ — డోమెక్













ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు.
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
[1938-1972]
శుక్రవారం : 4-3-'77
నలనామ సం. ఫాల్గుణ శు. చతుర్దశి
సంపుటము 70 : సంచిక 27
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
పోస్టులో ఏడాది చందా రు. 41-60
" ఆరుమాసాల చందా రు. 20-80
విడి ప్రతి వెల 75 పైసలు
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520003.

## విషయానుక్రమణిక

## 'కార్యనిర్వాహక రాష్ట్రపతి'
## శ్రీ బసప్ప దానప్ప జెట్టి

ఫిబ్రవరి 11 ఉదయం దేవునిపేర రాష్ట్రపతిగా ప్రమాణం తీసుకున్న ఉపరాష్ట్రపతి శ్రీ బసప్ప దానప్ప (64) తిరిగి రాష్ట్రపతి పదవికి ఎన్నికలై నూతన రాష్ట్రపతి పదవీ ప్రమాణం చేసేవరకు:— కార్యనిర్వాహక రాష్ట్రపతిగా, రాష్ట్రపతికి గల అన్ని బాధ్యతలు అధికారాలు హోదాలతో వ్యవహరిస్తారు. అమెరికాలోలాగా మన దేశంలో ఉప రాష్ట్రపతి — రాష్ట్రపతి జాగా ఖాళీ అయితే దాన్ని నింపడానికి వీలు లేదు —

ఆరు మాసాలలోగా ఎన్నికలు జరిపి రాష్ట్రపతిని ఎన్నుకోవాలి. రాష్ట్రపతిని ఉభయ పార్లమెంటు సభలు - రాష్ట్రాల అసెంబ్లీలు ఎన్నుకోవాలి గనుక లోక్‌సభ ఎన్నికలయితేతప్ప దీనిగురించి ఆలోచించే అవకాశాలు లేవు.

కార్యనిర్వాహక రాష్ట్రపతి శ్రీ జెట్టిగారు కూడా న్యాయవాది - రాజకీయవేత్త, మంత్రి, ముఖ్యమంత్రి - లెఫ్టినెంట్ గవర్నర్, గవర్నర్‌వంటి కీలకమైన పదవీ బాధ్యతలను



నిర్వహించినవారు. ఒక స్థాయినుంచి మరో స్థాయికి ఒక పదవినుంచి మరో పదవికి ఉత్తీర్ణులవుతూ ఆయన ఫిబ్రవరి 11న "అత్యంత క్లిష్టస్థితి" లో వున్న పెద్ద ప్రజాస్వామ్య దేశానికి పరిపాలనాధ్యక్షులు అయినారు - ఈ బాధ్యతను శ్రీ దానప్పగారు నిభాయించగలరని ఆశించాలి. ★

## ఉత్తరాలు

### సినిమా

11.2.77 తేదీ ఆంధ్రపత్రిక ముఖచిత్రం వాణిశ్రీ బాగుంది. లోకం పోకడ — ఉమెన్ కార్టూను బాగున్నాయి. "పెళ్ళిచూపులు" కథ బాగుంది. జయధర్ తిరుమల రావ్ గారికి మాధన్యవాదాలందజేయండి. శ్రీనివాస్‌గారు "పొగడడం తప్ప నాకు మరేం రాదు" అన్నట్లు ప్రతివారిని బాకా ఊదడం విసుగు కలిగిస్తున్నది.

వి. రామలింగాచారి, టి. బుల్లి సత్తిరాజు, (సామర్లకోట.)

### కథలు

4—2—77 సంచిక ముఖచిత్రం చాలా బాగుంది "కాలం వేసిన కాటు" 'దేవుడు పంపిన మనిషి' 'తండ్రిప్రేమ' కథలు చాలా బాగున్నాయి. సీరియల్ మగదిక్కు బాగుంది. ఇంతమంచి సీరియల్ మాకు అందిస్తున్నందుకు సంపాదకునికి అభినందనములు.

శారదా సిన్హా [జంగారెడ్డి గూడెం]

(50వ పేజీ చూడండి)

రామచంద్రుడు భోజనంచేసి త్రేన్చుతూ సత్రం బయటకు వచ్చాడు. పందుల సమీపాన భూమినుండి లేచిఉన్న చింతవేరు మీద కూర్చున్నాడు.

సత్రంలో దీపంవద్ద నాగ, కిష్టుడు భోజనం చేస్తున్నారు. ఒకమూల ముసలివాడు రెల్లుగడ్డి చాపమీద పడుకుని ఉన్నాడు. సత్రంచుట్టూఉన్న జిల్లేడు చెట్లలో మిణుగుర పురుగులు అవిరామంగా ఎగురుతున్నాయి.

గ్రామంలో కొందరు మగవాళ్ళు మద్దెలతో తాళంతో వీధినాటకపు పాటలు పాడుతున్నారు. గొంతులు తాళంతోను, మద్దెలతోనూ కలవడంలేదు. పాడిన చరణాన్నే మళ్ళీ పాడుతున్నారు.

పందులన్నీ నిశ్శబ్దంగా నిద్రిస్తున్నాయి. రామచంద్రుడు అగ్గిపుల్లను గీచి బీడీని ముట్టించుకున్నాడు. చర్రుమన్న శబ్దం వల్లను, అకస్మాత్తుగ పుట్టిన కాంతివల్లను కొన్నిపందులు లేచి మోరలెత్తి చూసి మళ్ళీ నిద్రకుపక్రమించాయి.

రామచంద్రుని భార్య పాత్రలను కడిగి ఎగబెట్టింది. ఈత చాపను పరచి కిష్టుడిని పడుకోబెట్టింది. దీపాన్ని ఆర్పివేసి, బొడ్లో దోపుకునిఉన్న పైటచెంగును తీసి వెనకకు విసిరి కొప్పును విప్పి దులుపుకుంటూ సత్రం బయటకు వచ్చింది.

రామచంద్రుడు బీడీ పొగను వదులుతూ, "సుక్కపందులు మూడూ రేపో మాపో ఈనతాయి" అన్నాడు.

"సరిగ్గా ఇట్టాటపుడే ఇల్లుకదిలి రావాల్సి వచ్చింది" అన్నది అతని భార్య దిగులుగా.

"ఈ పుణ్యంగూడ ఆ పెదరెడ్డికే దక్కని" అని రామచంద్రుడు వెనకకు తిరిగి ఉమిశాడు.

"అవి మూడింటిని చూలు నిలిచింది మొదలు తవుడు, గానుగపిండితోనే మేపినాం. బాగా సూటివైనప్పుడు రోడ్డమీద తిప్పితే సావు పిల్లల్నేసేస్తాయి. సామెజ్జెప్పినట్లు ఈనగాచి నక్కలపాలు జేసినట్టవుతుంది."

వేళ్ళ మధ్య బీడీ కాలుతూ ఉండగా రామచంద్రుడు, "ఇక వాటిని అలతపెట్ట కూడదు. రెండు దినాలుగాని, మూడుదినాలుగాని అవి ఈనేదాక ఈ ఊర్లోనే పొద్దు పోగొట్టాల" అన్నాడు.

"తారు రోడ్డుమీద నడచి నడచి సలుగు




*(గత సంచిక తరువాయి)*

లకు (పంది పిల్లలకు) గొట్టెలరిగిపోయాయి. చిగురుల్లోనుంచి నెత్తురు పెరుక్కుని దోవ పొడుగునా సుక్కలు సుక్కలుగా కారటమే. తల్చుకుంటే కడుపు కాలిపోతా ఉంది."

"నాలుగు నాళ్ళు ఒక తావున ఉంటేగాని ఆ గాయాలు మానవు. అందాక ఈ ఊర్లోనే కూలో నాలో చేసుకుంటూ ఉండాల్సిందే" అని బీడీని చివరి సారిగా పీల్చి పారేశాడు రామచంద్రుడు.

రెల్లుగడ్డి చాపమీద పడుకుని ఉన్న ముసలివాడు గురక పెడుతుండడం విని పిస్తున్నది. సత్రం చుట్టూ ఉన్న జిల్లేడు పొదలలో మిణుగురు పురుగులు అల్లిబిల్లిగా తిరుగుతున్నాయి. ఊరిలో వీధినాటకం వాళ్ళు అపస్వరాలతో, తప్పుడు రాగాలతో సతమతమవుతున్నారు.

గ్రామం నుండి లాంతరు ఒకటి చీకటిలో సత్రంవైపు వస్తూ ఉండడం కనిపించింది.

***జరిగినకథ : 6*** రామచంద్రుడు చేసిన చాకిరీకి ఫలితంగా ఇల్లుకట్టుకోవటానికి పోరంబోకు నేల ఇప్పిస్తాడు పెదరెడ్డి. రామచంద్రుడి భార్య నాగ. పెదరెడ్డి కోరినట్లు కోర్టుకెళ్ళి దొంగ సాక్ష్యం చెప్పడు రామచంద్రుడు. పెదరెడ్డి రిపోర్టు చేయటంతో పోరంబోకు ఖాళీచేయమని రామచంద్రుడికి ఉత్తర్వు జారీ చేస్తాడు కలెక్టరు. పెదరెడ్డిని వేడుకోటానికి వచ్చిన రామచంద్రుడిని తోటి హరిజనులే హింసిస్తారు. రామచంద్రుడి ఇల్లు పడగొట్టిస్తారు ప్రభుత్వాధికారులు. ఊరు వదిలిపెట్టి బయల్దేరతాడు రామచంద్రుడు కుటుంబంతో.

లాంతరు నరుగా వా... గుంపు వద్ద ఆగింది. తలపాగా ధరించిన ఒక మనిషి లాంతరును పట్టుకుని ఉన్నాడు. అడ్డపంచెలను ధరించి ఉన్న మనుషులు ముగ్గురు అతని వెనుక ఉన్నారు.

రామచంద్రుడు చింతవేరు మీద నుండి లేచి నిలుచున్నాడు.

లాంతరు పట్టుకుని ఉన్న మనిషి, "ఎవురయా ఈడ తూరుపు నుంచొచ్చిన మనిషి ఉండాడంట?" అన్నాడు.

"నేనే సామి. ఈ పొద్దు మాపిటేళే వొచ్చినా."

"నీ దగ్గర పందు లుండాయంటనే ఇవేనా. వెలకిస్తావా?"

"ఇస్తాను సామి. మీకు ఏవి గావాల? గున్నలా? సలుగులా?"

"సలుగులు మాకెందుకయ్యా. పందులు మేపేది మా కుల ఉత్తి అనుకుంటివా?కోసుకు తినేదానికి రెండు గున్నలు (మగ పందులు) గావాల."

"సూస్కోండి సామి. గున్న లుండాయి. ఎడపెట్ట లుండాయి. మీరే సూస్కోండి" అన్నాడు రామచంద్రుడు.

ఆగంతకులు లాంతరు వెలుగులో పందులను పరిశీలించడం ప్రారంభించారు. ఈ గడబిడకు కొన్ని పందులు లేచి నిలుగుతూ వొళ్ళు విరచుకుని మళ్ళీ పడుకున్నాయి. మరికొన్ని కీచుకీచుమని శబ్దం చేస్తూ మనుషుల వైపొకసారి చూసి మళ్ళీ నిద్ర కుపక్రమించాయి.

వాళ్ళు రెండు పందులను ఎన్నిక చేశారు. తలపాగా మనిషి, "ఆ వారన, జంటగా పడుకుని ఉండాయే వాటికజ్జెప్పు. ఎంత కిస్తావు?" అనడిగాడు.

రామచంద్రుడు ఆ చివరన సుఖ నిద్ర జెంది ఉన్న గున్నలను ఒకసారి చూసి, "అవా సామి. అవి సుక్క గున్నలు. ఒక్కొటొక్కటి నూట యాభై అవుతాయి. రెండూ కలిపి ఇన్నూట యాభైకి తోలుకు పొండి" అన్నాడు.

"ఓరినీ. యావూరునించొస్తివో గాని మావూరినిళ్ళుతాగేసరికి కొండెక్కి కూర్చుంటివి గదయ్యా." అన్నాడు తలపాగామనిషి.

"పరాయి ఊరుగాబట్టి ఇన్నూట యాభై చెప్పినా. ఉండగా రైతే మూడునూర్లు చెప్పిఉందును!" అన్నాడు రామచంద్రుడు.

ఎంటలు బాగా నర్చినావయ్యా. ఐత నీసొంత ఊరు ఏదో.'' అనడిగాడు తలపాగా మనిషి.

"మావూరిపేరు గంగపట్నం సావి.ఈడికి వన్నూరుమైళ్ళు''

"అవూర్లో జనం రూపాయలను పెంకుడు బిళ్ళలుగానూ, పందులను దేవుళ్ళు గానూ మతించెట్టుగా ఉంది.''అన్నాడు అడ్డ పంచెను ధరించి ఉన్న ఒక వ్యక్తి.

తలపాగా మనిషి అతనితో, 'ఊరుకో.' అన్నట్టు సైగచేసి, "తూరుపాయనా. ఏందుకీ కతలన్నీ. ఇచ్చేబేరం చెప్పు రాతిరైపోతాఉంది.'' అన్నాడు.

"చెప్పినాను గద సావి.ఇన్నూట యాభై అని.''

"అది నువ్వు జెప్పిన బేరం. మాబేరం ఇన్నూరు. ఏఁవంటావు?'' అన్నాడు తలపాగా మనిషి.

"ఒదగదు సావి. ఇన్నూట యాభైకి తక్కువైతే ఆమాటే ఎత్తొద్దండి.'' అన్నాడు రామచంద్రుడు.

తలపాగా మనిషి మళ్ళీ ఒకసారి సుక్కగున్నల వైపుచూసి, "వీటికి ఇన్నూట యాభై ఏందయ్యా. బలిసిన పందికుక్కలంత లేవు.'' అన్నాడు.

"అవి సుక్కగున్నలు సావి. కావాలనుకున్నా ఆ జాతి గున్నలు ఈ సుట్టుపక్కల్లో యాడా దొరకవు'' అన్నాడు రామచంద్రుడు.

తలపాగా మనిషి "దీనక్కలాంటి గున్నల్ను సూసనాంలేవయ్యా, వచ్చేమంగళవారం గంగ జాతర. పులుసులోకి పందో, మేకో, పొట్టేలో ఏదో ఒకటి కావాలి. సుక్కగున్న ఐతేనేమి ? బోరుగున్న ఐతేనేమి? నువ్విప్పుడు బేరం తెంచకుంటే వేరుగ కడదోవన్నే పక్కూరుకుపోయి రొండు పొట్టేళ్ళను మాట్లాడుకొచ్చేస్తాం. చెప్పు కడబేరం. ఇన్నూటఇరవై'' అన్నాడు.

"గిట్టుబాటుకాదు సావి. నాకుండే ఆస్తిపాస్తులన్నీ ఈ పందులే. వీటిని అయినకాడికి మద్దెనంగా అమ్ముకుంటే నేను బతకలేను'' అన్నాడు రామచంద్రుడు.

"ఇగ నీయబ్బతోడు'' అంటూ తలపాగా మనిషి లాంతరును చేతిలోకి తీసుకుని "పదండి మావా ఇది వొదిగే బేరంగాదు. ఊరికే నిద్దర పంచేటు'' అంటూ లేచి రోడ్డువైపు దారి తీశాడు. మిగిలిన రైతులు అతనిననుసరించారు.

రోడ్డుమీద పారుగూరివైపు సాగిపోతున్న లాంతరును చూస్తూ, రామచంద్రుడు అలాగే నిలుచున్నాడు. నాగ అతని మోచేతికి రొమ్ములు తగిలేంత చేరువగా వచ్చి నిలుచుని రహస్యం చెబుతున్న దానివలె "వాళ్ళను వినక్కుపిలిచి రొండు సుక్క గున్నలను తెగ చెప్పెయ్యరాదా. ఐత గున్నలు ఇన్నూట ఇరవై పలకతా ఉంటే ఇంకా తీపరమా.'అంది.

'ఇంత మ్యాతానికే సంకలు గుద్దుకుంటా వేందే. గంగజాతర ఇంగా దగ్గిర పడనీ సూతువు. సుక్కగున్న ఒకతాకటే ఇన్నూట ఇరవై పలుకుతుంది. నీకెందుకీ యవారాలన్నీ నువ్వులోపలకుపో.' అన్నాడు రామచంద్రుడు.

లాంతరు కనుమరుగైపోయింది. రామచంద్రుడు పందులవైపు కొంతసేపు చూపి అస్పష్టంగా కొన్ని అంకెలమ పలుకుతూ, చూపుడు వ్రేలితో గాలిలో కొన్ని నిలువు గీతలు, కొన్ని అడ్డగీతలు గీశాడు.

చీకటిలో మిణుగురు పురుగులు అసంఖ్యాకంగా, విచ్చలవిడిగా ఎగురుతున్నాయి.

అతడు తన మనో గణితాన్ని పూర్తిచేసి తృప్తిగా గాలిపీల్చుకుని, పెద్దగా నోరు తెరచి ఆవులించాడు సత్తంలోని గోనెసట్టను తెరచి దానిని పందుల గుంపు పక్కన పరచుకుని పడుకున్నాడు.



## 11

సూర్యుడు ఇంకా ఉదయించలేదు. రామచంద్రుడు నిద్రలేచి కళ్ళు తెరచి చూశాడు అతని పందులు చింత మాను క్రిందఉన్న దిబ్బను ఆతురతతో కెలుకుతున్నవి ఒకపంది తన వెనక కాలిగిట్టతో గొంతు కింద గిరుకుంటూ యజమానివైపు చూపి మళ్ళీ దిబ్బను కెలకడం ప్రారంభించింది.

రామచంద్రుడు తల త్రిప్పి సత్తంలోకి చూశాడు. కిష్టుడు ఈత చాపమీద ఇంకా నిద్రపోతూనే ఉన్నాడు రామచంద్రుని భార్య అప్పుడే నిద్రలేచి పైటను తీసి రొమ్ముల మిదుగా భుజంమీద వేసుకుని బయటకు వచ్చింది.

రామచంద్రుడు, "కిష్టుడికెట్టుంది?'' అనడిగాడు.

జుట్టును ముడి వేసుకుంటూ ఆమె, 'రాతిరంతా వాడు నిద్రపోలా తెల్లవారు జామున కన్ను మూశాడు'' అన్నది.

"ఈతాకుర్నేని జేసినాడు. అన్నీ నమిలినాడా? పారేసినాడా?"

"అన్నీ నమిలినాడు. సందేల చేత బావి దగ్గర తొట్టె స్నానం గూడా చేయిస్తిని. ఏం జేసినా తగ్గలా."

"వాడికి ఎండ దెబ్బ బాగ తగిలినట్టుంది. అదే తగ్గిపోతుందిలే" అంటూ లేచాడు రామచంద్రుడు. అతడు మెడ వెనక చేతులను కూర్చుకుని వొళ్ళు విరుచుకుంటూ వెనుదిరిగాడు.

రక్తం పులుముకున్నట్లు సూర్య బింబం తూర్పు కొండల వెనక కనిపించింది.

ముసలివాడు అప్పటికే బావి దగ్గర స్నానం ముగించి, సూర్య నమస్కారం చేస్తున్నాడు.

సత్రం ప్రక్కన ఉన్న దేవాలయం శిథిలావస్థలో ఉన్నది. గుడి చుట్టూ ఉన్న ప్రహరీ గోడ మూడు వైపుల కూలిపోయి ఉన్నది. గర్భగుడి గోడమీద బొగ్గుతో ఒక బూతు బొమ్మ రాసి ఉన్నది. గుడి తలుపు బార్లా తెరచుకుని ఉన్నది. లోపల దీపం లేదు.

## ఇన్‌క్రెడిబుల్ గాడెస్

ఊరిలోని ఇండ్లు ఉదయపు ఎండలో స్పష్టంగా కనిపిస్తున్నవి. అన్నీ పూరిండ్లే. కొన్ని ఇండ్లు రెండు మూడు రకాల గడ్డితో కప్పబడి ఉన్నాయి. కొన్నింటికి కప్పులు లేచిపోయి ఉన్నాయి. పేదరికాన్ని చాటుతున్న పూరిండ్లమధ్య మూడంతస్థుల మేడ ఒకటి సమాధుల మధ్య జయస్తంభం వలె నిలుచుని ఉన్నది. రెక్కలు విరిగిన అమాయకములైన కీటకాలను తన పడగనీడన చేర్చుకుని ఏ క్షణానన్నైనా కబళించడానికి నాలుకలు చాస్తూ నిలుచునిఉన్న నాగుబాము వలె ఆ మేడ నిలుచుని ఉన్నది.

ఊరికి పడమరగా చెరకు తోటలు విస్తారంగా ఉన్నాయి. చెరకు కర్రలు మోకాలెత్తు పెరిగి ఉన్నాయి. చెరకు తోటలో బాటల వెంబడి కొందరు కూలీలు తిరుగుతున్నారు వారు చెరకు కర్రలకు సేంద్రియపు ఎరువులను, గానుగపిండినీ వేస్తున్నారు.

ముసలివాడు సూర్యనమస్కారం ముగించాడు. తడిసిన తువ్వాలుతో అతడు సత్రంలోకి వచ్చాడు. మూలన ఉన్న తన కావిడిని తీసుకొచ్చి సత్రం బయట నీరెండలో పెట్టాడు. దానిముందు కూర్చుని "నువ్వు బలేటోనివయ్యా తూరుపాయనా నిద్రపోతే కుంభకర్ణుడిని మించి పోతావు" అన్నాడు.

రామచంద్రుడు మునిగాళ్ళపైన నిలుచుని చింతకొమ్మను వంచి, జానెడుపుల్లను విరచి, "నిన్నంతా దోవన నడిసినా సామి. కాళ్ళు సలుపులెక్కిపోయినాయి. పడుకునిందొకటి తెల్సు. ఆ పైన ఈ పానం ఏయే లోకాల్తిరిగిందో నాకే తెలియదు" అన్నాడు.

ముసలివాడు తిరుసూర్ణాన్ని కావడిలో నుండి తీసి కొంచెం ఎడమ అరచేతిలో వేసుకుని నీటితో రంగరించి "మీపిల్లవాడు రాత్రంతా తాను నిదబోక వాళ్ళమ్మను నిద్ర బోనీక యమకూలం పెట్టేసినాడనుకో. నువ్వు మాత్రం మూసిన కన్ను తెరవకపోతివి" అన్నాడు.

రామచంద్రుడు చింతపుల్లను నోటా,

వాట్సానుస నములుతూ నాను కండ్లు తెరిచి చూ తం చేసెదెను ంది. వానికి వొళ్ళు కాక పట్టుకుంది నిన్నదోవలో ఎండబాగ వడగొట్టేసింది. అప్పటికి ఈతాకులు నమిలాడు తొట్టిస్నానం చేసినాడు.'' అన్నాడు.

ముసలి వాడు నాగవైపు తిరిగి, ''పిల్ల వానికి వొళ్ళుకాక అనేమాట రాతిరి నాకు చెప్పక పోతివి గద తల్లీ. దానికి సరైన కిటుకు నేను చెపాను పిడికెడు దనియాలు నమలి పసరు మింగమను. టక్కున కుదిరి పోతుంది.''అన్నాడు.

నాగ, ''పచ్చిదనియాలా నాయ్నా?'' అనడిగింది.

''పచ్చిదనియాలు దొరికితే మరీమంచిది లేకపోతే ఎండు దనియాలు నీళ్ళలోనే నాన వేసి తినిపించు.''అనిముసలివాడు కావడినుండి అద్దపు ముక్కను తీసి అందులో చూస్తూ తన నుదుట నామం దిద్దటంలో మునిగి పోయాడు. నామం దిద్దటం పూర్తి చేసి,''ఒక వేళ దనియాలతో కుదరకపోతే ఒక గళాసు టెంకాయనీళ్ళు తాపించు. దానితో దాని ఆట కట్టు, వొళ్ళుకాకకు టెంకాయనీళ్లు రామ బాణ మనుకో'' అన్నాడు.

అతడు కావడిపెట్టె నుండి ఒక్కొక్క వస్తువునే ధరిస్తూ, సూర్యుడు ఆకాశంలో బారెడెక్కేసరికి తన బికుక వృత్తిని పూర్తి చేశాడు. మెడలోని రు ద్రాక్షమాలను, కాషాయ వస్త్రాలను సవరించుకుని, ''తూరుపాయనా. నేను ఊరిమీద పోతా ఉండా. తిరిగొచ్చేసరికి ఎంత పొద్దవుతుందో తెలియదు. అప్పటికి నువ్వు ఉంటావో ఉండవో'' అన్నాడు.

తను ప్రయాణాన్ని రద్దు చేసుకున్న వైనం రామచంద్రుడు ముసలివానికి చెప్పాడు.

ముసలివాడు బవిరి గడ్డంలో కనపడ కుండా నవ్వి, ''ఐతే ఇంగా నాలుగు నాళ్ళు పాటు మా 'హొంటిల్లు అగ్రహారం' నీళ్ళు తాగతానంటావు. ఈ ఊరు నీ కెప్పుడో రుణ పడి ఉంది'' అంటూ ఆకాశంవైపు చూసి ''అంతా వాని దయ!'' అని వంగి కావడిని భుజాన పెట్టుకుంటూ ''జై పాండురంగ విఠలా'' అంటూ మరొక చేతిలో తంబురాను పట్టుకుని గ్రామం వైపు సాగిపోయాడు.

పందులు తమ పన్నని తోకలను ఆడించు కుంటూ దిబ్బను కుళ్లగిస్తూ ఆహారంకోసం వెదుకుతూ ఉన్నాయి. గర్భంతో ఉన్న ముక్క పందులు మూడూ భారమైన పొట్టలను ఊగించుకుంటూ దిబ్బమీద నుండి దిగి చింతమాను నీడలోకి నడిచి పడుకున్నాయి.

సూర్యుని కిరణాలు చురుకుగా తాకడంతో కిష్టుడు నిద్రలేచాడు. వాడు స్వతం బయట కొచ్చి, జిల్లేడు పొదలలోకినడిచి, ఒకచేతో తలను గీరుకుంటూ, మరొకచేతో నిక్కరును పైకెత్తి కూర్చున్నాడు.

రామచంద్రుడు చింతపుల్లను నమలడం ఆపి కొంత సేపు కిష్టుని వైపుచూసి తరువాత నాగవైపు తిరిగి, ''ఆ పెట్టెలో దనియాలుండాయేమో చూడు. లేకుంటే నేను ఊర్లోకిపోతా ఉండు కొన్ని పెట్టించుకొస్తా.''

నాగ పెట్టెమూతను తెరచి వెదకి, ''ఉండాయిలే,ఒకచారెడు. అవిచాలు'' అంది.

''నీళ్ళకో నానవేసి వానికి పరగడుపున్నే తినిపించు'' అంటూ తువ్వాలు గుడ్డను తీసి భుజానవేసుకుని గ్రామంవైపు నడచాడు.

గ్రామంమొగదల ఒకమనిషి చింతమొద్దు మీద కూర్చుని దారాలు పేనుతున్నాడు. అతడు రామచంద్రుని వైపు ఇంచుక సేపు చూసి ''యాపూరయామీది? ఒకపక్కపొద్దు పుట్టంగానే పండ్లుతోముకునేటంత తీరిగ్గా ఉన్నావు?'' అనడిగాడు.

రామచంద్రుడు వడకను ఆపి, ''మాది తూరుపుదేశం సామి. రోడ్డుకాడ సత్రంలో దిగినా, ఎవురన్నా కూలికి పిలుస్తారేమోనని చూస్తా ఉండా,'' అన్నాడు.

''సరిపొయ్యింది. సామెజెప్పినట్టుంది నీ యవ్వారం. కూలోళ్లను పిల్చుకునేటంత గనమైన సేద్యం మా కెవురికీలేదు. మాకుండేదంతా తలా గోచిపాత యడం కయ్యలు. ఊరుసుట్టూ మూడు చెరువుల కింద ఉండే భూములన్నీ మా మునసబు ఆపుకోనుండాడు. కూలి ఇచ్చినా పట్టినా వాడే ఇయ్యాల పోయి అడుగు.''

రామచంద్రుడు తల త్రిప్పి చూశాడు. పూరిండ్ల మధ్యనున్న మూడంతస్తుల భవనం ఇప్పుడు మరింత స్పష్టంగా కనిపిస్తున్నది. భవనానికి ఉన్న కిటికీలు, కిటికీ ఊచలు, తెరలు కనబడుతున్నాయి. రామచంద్రుడు అటేచూస్తూ ''అడ కనబడేదేనా మీ మునసబు ఇల్లు ?'' అనడిగాడు.

దారాలు పేనే మనిషి ''ఇది ఒక అడగాటమే నంటయ్యా. అంతెత్తుమిద్దె ఇంకెవురన్నా కట్టుకోనుంటే వాడు ఊరికే ఉండునా ? అంత పచ్చగా ఇంకెవురన్నా బలికితే వాడు ఓర్చుకుని ఉండునా ? ఏదో తిరకాసు పెట్టి కొంపలో దీపం ఆర్పెయ్యడా ?'' అంటూ అతడు పేనిన దారాన్ని చుట్టగ చుట్ట సాగాడు.

''వాడు దీపాలు ఆర్పేవాడైతే నాకేమి. గోతులు తీసేవాడైతే నాకేమి. ఒకటి రెండు దినాలపాటు నన్ను కూలికి పెట్టుకునే ఆసామి దొరికితే నాకు అది చాలు'' అన్నాడు రామచంద్రుడు.

దారాల మనిషి చింత దుంగమీద నుండి లేచి, ''నువ్వు దిన కూలికి వచ్చినోడివా. ఐతే నీకు పని ఒదిగేది కష్టమే. మా మునసబుకు కూలీలకేం కొరత? మాలపల్లంతా వానిదే కదా. వాడు పోయి మాలపల్లి ముందర






మానవుడు తరించడానికి గురువువల్ల ఉపదేశం పొంది, ఆయన చెప్పినట్లు నడుచుకుంటే సులభంగా కృతార్థతను పొందుతారు. కొందరు తమకు ప్రగాఢమైన గురుభక్తి ఉన్నట్లు భావిస్తారు గాని కృతార్థులు కాలేకున్నారు. గురుభక్తి ఉన్న వాళ్లల్లోనే ఇలా వ్యత్యాసం ఎందుకు కలుగుతున్నది? ఈ విషయం ఆలోచిస్తే కొందరి భక్తి పరిణతం కాలేదని, వారిభక్తి సరియైనది కాదని అనుకోవలసి ఉంటుంది.

సరియైన గురుభక్తిని వివరిస్తూ కొన్ని గుణాలు చెప్పి అవి ఉన్నవారికి గురుభక్తి సాధ్యమై ఉంటుందని శ్రీ శేషాద్రిస్వామి ఒకప్పుడు తెలియజేశారు.

## సరియైన గురుభక్తి

ఈగకువలె పరిశుద్ధత, చీమకు పోలిన పరిశ్రమ, కుక్కకుండే విశ్వాసం, రతీదేవికుండే ప్రేమ ఆ ఉత్తమగుణాలు. అవి వుంటే గురుభక్తి సులభమని ఆయనవాక్కు.

ఈగ మంచి వాటిమీదా, చెడ్డవస్తువుల మీదా కూడా వాలుతుంది. కుళ్ళు పదార్థాలు, అమేధ్యంమీద కూడా వాలుతుంది. అయినా దానికి మాలిన్యం అంటుకోదు. అది పరిశుభ్రంగానే ఉంటుంది.

అత్యల్పమైన ప్రాణి అయినా అవధిలేని పరిశ్రమ చీమది. కనురెప్పపాటు కాలమయినా వ్యర్థం చెయ్యక ఎప్పుడూ ఏదో పని చేస్తూనే ఉంటుంది. ఏ అల్పమైన ప్రాణి అయినా లిప్తకాలమయినా ఒకచోట నిలిచి వుండడం కాన వస్తుంది. అలా కదలిక లేక నిలిచివున్న చీమను ఎవ్వరూ చూచి ఉండరు. దాని స్వభావం అట్టిది.

కుక్క విశ్వాసం ఎట్టిదో అందరికీ తెలుసును. ఒకసారి నాలుగు మెతుకులు పడవేస్తే చాలును. అది మన యింటికి కాపలా గాస్తుంది పొమ్మని తరిమినా పోదు.

రతీదేవి పతిభక్తి సాటి లేనిది అట్టి పాతివ్రత్యం ఉన్నవారికే భర్తపై అనిర్వచనీయమైన ప్రేమ ఉంటుంది. ఆమె భర్త మృతి పొందగా సహగమనానికి సిద్ధపడి దైవ వాక్కును బట్టి ఆ ప్రయత్నం మాని, ప్రద్యుమ్నుడుగా అవతరించిన తన భర్త కోసం నానా తిప్పలుపడింది. శంబరాసురుని యింట్లో సేవకురాలుగా కూడా చేరింది అన్ని విధాలా భర్తను కాపాడుకొన్నది

గురువుయందు ఇట్టి ప్రగాఢమైన ప్రేమ ఉండాలి. భయం పనికిరాదు అటే గురువుగారియెడల గట్టి విశ్వాసం, ఆయన చెప్పినరీతిని నిరంతరకృషి, మనోవాక్కాయములు, పరిశుద్ధత ఉండవలెను. అట్లు ఉన్నవానిదే సరియైన గురుభక్తి, అట్టివాడు అన్ని కార్యములను సాధింపగలడు.

---

అట్టా నిల్చున్నాడంటే ఇంటికొక మొగోడు ఒక ఆడదీ వచ్చి చేతులు కట్టుకుని వాని ముందర నిలుచుంటారు. నువ్వెవరివో దోవన పొయ్యేటోడివి. నిన్ను కూలికి పిలుచుకునే అవసరం వానికేం వచ్చింది. ఐనా అడిగి సూడు ఏదన్నా దొరుకుతుందేమో. యతనం చేయకుండా ఆశ యిడిసి పెట్టేయడం పనోనికి లాయకీ గాదు" అంటూ పైకి లేచి "ఏందో ఈ బతుకులు. పని చేసానసేవానికి పని దొరికేది లేదు. పని చేసినోనికి కూలి గిట్టేది లేదు. మన బతుకులె ఇట్టా తెల్లారి పోతా ఉండాయి" అన్నాడు.

'కూలి దొరక్కపోతే పీడా పోయిందిలే సామి. నాకాడ ఇరవై పందు లుండాయి. వాటిని మేపుకుంటా వుంటే నా కీ రెండు దినాలు గడిచి పోతాయి" అన్నాడు రామచంద్రుడు.

## ఇన్‌క్రెడిబుల్ గాడెస్

"పందుల్నా. గొర్రెల్నా మేపుకునేందుకు ఈడెవురు 'కుదవ' లేసుకోనుండారు? ఊరు సుట్టూ ఉండే బూము లన్నిట్నీ బండల్తో బరకల్తో సహో మా మునసబు పట్టాజేసుకోనున్నాడు, తప్పి తగిలీకిమాకు తలా కొంత చవిటి పర్రలు దక్కినాయి.' అంటూ దారాల మనిషి నడుం వంచి మిగిలి ఉన్న నారను సేకరించి కట్ట కట్టుతూ, "ఇక నువ్వు పందుల్ని మేపుకోవాలంటే 'కాన'కు తోలుకొని పోయి మేపుకోవల్సిందే" అన్నాడు.

"'కాన' అంటే అది యాడనో?" అవడిగాడు రామచంద్రుడు.

దారాల మనిషి నార కట్టను, దారాల చుట్టను చంక నిరికించుకుని, మరొక చేతిని చెంకు తోటలవైపు చూపిస్తూ, "అదో ఆ చెరకు తోటల కెనకాల గ్రామనత్తం బూమి నాలుగెకరా లుండాది. దాన్నిండా. చెట్లు, పుట్టలు, రాళ్లు రప్పలు ఉండాయిలే అందుకే దాన్ని మేమంతా 'కాన' అంటాం. ఆ బూమి మాత్రం ఇంకా మునసబు చేతి కిందకురాలా. అది మట్టుకు ఎన్నాళ్లులే. 'కాన' చుట్టూ ఉండే చెరకు తోటలన్నీ మునసబువే. అనుకున్నాడంటే ఆ నాలు గెకరాలను గూడా నిముషంలో గుటుక్కున మింగేసి నీళ్ళు తాగేస్తాడు" అంటూ సూర్యుని కిరణాలకడ్డంగా అరచేతిని పెట్టుకుని చూసి, "పొద్దు నాలుగు బార లెక్కింది. నా తీరుబాటు మండ. ఏగు పొద్దున మాటలు పెట్టుకుంటిని కదయ్యా'! అంటూ పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ పొలాలవైపు సాగిపోయాడు.

(ఇంకా వుంది)



బ్రహ్మయ్య మాష్టారి శవం కాల్తోంది. నిర్మలంగా వున్న ఆకాశంలోకి, ఎర్రని నాలికలు చాచుకుని, మంటలు ఉధృతంగా ఎగురుతున్నాయి.

'బాబూ ... మాకు శలవిప్పించండి ...' అంటూ వాహకులు ముగ్గురూ, తడిబట్టలతో ఎదురుగా నిల్చున్నారు. వారికేసి చూశాను.

ముగ్గురూ పీకలమొయ్యా తాగివున్నారు కళ్ళు ఎర్రగా వున్నాయి. అప్పుడే స్నానంచేసి వచ్చిన వాళ్ళ తలల మీంచి నీళ్ళు బొట్లు బొట్లుగా, వారి బలిసిన ఛాతీలమీద, కడుపుల మీద పడు తున్నాయి.

ఇలావున్న వీళ్ళు మాష్టారి శవాన్ని ఎలా మోసుకొచ్చారా—అని ఆశ్చర్యమేసింది.

ఏం మాట్లాడకుండా జేబులో చెయ్యి పెట్టి, ఇరవై రూపాయల నోటు తీసి ఇవ్వబోయాను.

'అదేటిబాబూ ... దిక్కులేని పంతులు శవం, తమరు పున్నెం కట్టుకున్నారు. మీ దగ్గిర డబ్బు పుచ్చుకుంతామా? మీ పున్నెంలో మాకూ బాగం వున్నండి బాబూ ... ఎల్తొస్తాం...' అంటూ ముగ్గురూ నిష్క్రమించారు.

చుట్టూ కలియజూశాను. అంతా నిర్మానుష్యం. సూర్యుడు 'అస్తమించడానికి' సన్నిద్ధ మౌతున్నాడు. పడమరదిక్కు, సిందూరం, బంగారం కలిసిన రంగులో వుంది. సడి లేకుండా శ్రద్ధగా వీచే గాలి, పంతులుగారి శవాన్ని అతిసునాయాసంగా దహించివేస్తోంది. నిన్నా, మొన్నా కాల్చిన చితుల చివరి దృశ్యాలు, ఉదయమే ఎవరో పసివాడి శవాన్ని కప్పెట్టిన గుట్ట, అరగంట క్రితమే అక్కడి ఓ తులసికోట మీద పెట్టిన నూనె ప్రమిదలో, గాలికి ఇటూ అటూ ఊగుతున్న జ్యోతి 'ఇంకెంతసేపు, తొందరగా వెళ్ళవయ్యా మహానుభావా! మాకు చాలా పనులున్నాయి.' అని, కొన్ని ఆకాశంలో సూర్యుడికేసీ, మరి కొన్ని నాకేసీ, కోపంగా దూరం నుండి చూస్తున్న నక్కలు — ఇవీ నా కంటబడ్డ దృశ్యాలు.

మాష్టారి చితికేసి చూశాను. బక్కపలచని ఆ తెల్లని శరీరం, శరీరానికి మించిన సైజులో వున్న ఆ పెద్ద తల, సన్నటి కాళ్ళూ—చేతులూ, ఇవన్నీ ఎర్రని పలచని బట్టలో చుట్ట చుట్టినట్టు, మంటల్లో చిరుశబ్దంతో కాలిపోతున్నాయి.

'మాష్టారూ ... చివరికి మీ బతుకిలా తెల్లవారిందా? నేను ఈ క్షణంలో దురదృష్టవంతుణ్ని? అదృష్టవంతుణ్ని? ... ఎంత గొప్పగా బతికారు మాష్టారూ ... ఆ రోజులన్నీ ఏమైపోయాయి మాష్టారూ ...' నా కళ్ళల్లో నీళ్ళు ఆగలేదు. గొంతుకలో దుఃఖం వెలికి రాలేక, లోన ఇమడలేక సతమతమై పోయింది. రుమాలు తీసి కళ్ళు తుడుచుకున్నాను.

అరవై ఏళ్ళు నిండిన మాష్టారు, అందరూ వుండి, చివరకు ఎవరూ లేని మాష్టారు, మా బతుకులకు ఒక అర్థం కల్పించి, తన బతుక్కే ఏ అర్థమూ లేదని, చివరికి- ఇలా, చిరునవ్వూ — చేయూతా లేక, ఒక మంచి మాటా — ఒక సానుభూతీ లేక ... ఒంటరిగా, మనుషుల కోసం — వారి మమతలకోసం, ఎదురుచూసి ఎదురుచూసి, చివరికి ఆశ వృధాకాగా, నిసే జమైన కళ్ళతో. నిరాశా నిస్పృహలతో, ఆ కుక్కి మంచంలో, అలా కళ్ళు మూసారు.

'మాష్టారూ ...' ఆక్రోశించింది నా గుండె.

మాష్టారి శవం నా దుఃఖాన్ని, ఆవేదనని అర్థం చేసుకున్నట్టుగా, తప్న లేచికూర్చుంది.

నా గుండె వడివడిగా కొట్టుకుంది. ఏం చెయ్యాలో బోధపడలేదు. కాటికాపరి కనబడ లేదు. కాళ్ళూ చేతులూ వణికాయి.

ఎవరో ఎప్పుడో అన్నమాటలు గుర్తుకు వచ్చి, నిడుపాటి కర్రకోసం చుట్టూ వెతికాను. చితికోసం తెచ్చిన కర్రల్లో, ఓ పెద్ద కర్ర కనబడింది. అది తీసుకుని, రెండు చేతులతోనూ బలంగా పైకెత్తాను.

నేను చేయబోయేపని నాకు తెలుసు. దుఃఖం కట్టలు తెంచుకుని బయటకురికింది. ధారగా, కళ్ళల్లోంచి నీరు, బుగ్గల మీదకు జారిపోతూంది

'క్షమించండి మాష్టారూ..' అంటూ ఆ కర్రతో బలంగా మాష్టారి శవం మీద మోదాను. అది యథాస్థితికి వచ్చింది.

'బదులు తీర్చుకుంటున్నావా అప్పారావ్' అన్న మాటలు విని, వులిక్కిపడ్డాను.

ఎవరివా మాటలు? అక్కడ ఎవరూలేరు. కేవలం భ్రమ. మాష్టారి గొంతులా, ఆయన అన్నట్టు ఓ భ్రాంతి.

'చిన్నప్పుడు వేలబారుగావున్న మీ బ్రతుకులు ఉన్నత మార్గంలో పయనించాలని కొట్టాను. ఇవాళ ఉన్నతంగా లేవబోతున్న నా శవం, నేలబారుగా అయేందుకు నువ్వు కొట్టావ్. బదులు తీరిందిలే అప్పారావ్' అంటున్నారు మాష్టారు.

'ఈ వూరు ఇందుకా రమ్మని రాశారు మాష్టారూ? చాలా సంవత్సరాలకి, మీ చేతి వ్రాతచూసి, అందులోనూ 'ఒకసారి రా. నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి' అనే అత్యంత వాత్సల్యపూరితమైన ఆహ్వానం అందుకుని, రెక్కలు కట్టుకుని వచ్చానే! ఈ దృశ్యం చూడ్డానికా? ఏదైతేనేం మాష్టారూ... ఇలా నేను రావడం కూడా మంచిదే అయింది. లేకపోతే...లేకపోతే. మీ చివరి దర్శనం కూడా అయ్యేది కాదు. మీ

## వాహకులు కావాలి

శవానికి కూడా ఏ దుర్గతి పట్టి వుండేదో? అంతా మన మంచికే మాష్టారూ..' అని మనసులో అనుకుంటూండగా, నిన్న మాష్టారి శవ దహనం గురించి జరిగిన చర్చలు కళ్ళ ముందు మెదిలాయి.

* * *

'అయితే ఏవిటంటారండీ? నేను రావడానికి కుదరదు. మా ఆవిడ కడుపుతోవుంది. ఇంట్లో వప్పుకోరు...'

'అయ్యో...అదెంత పన్నాయనా? బ్రహ్మయ్య ఎలాటి పాడు పనులు చేసినా సాటివాడు. వాడు పొయ్యాడూ అంటే, రావడానికి ఇంత ఆలోచన దేనికి? నాకైతే ఏ అభ్యంతరమూ లేదుగానీ, రేపు మా ఇంట్లో మా మనవడి నామకరణోత్సవం. మా అమ్మాయీ. అల్లుడూ ఇవాళ ఇలాంటి అశుభకార్యం చెయ్యడానికి వప్పుకోరు. అంచేత...'

ఇలా బ్రహ్మయ్య మాష్టారి సాటివారు తప్పించుకున్నారు. కనీసం శవం చూడ్డానికైనా రాలేదు. ఇంటి పక్కనుంచి వెళ్తూ కూడా, ఓ సారి తొంగి చూడలేదు

సాటివారిలోనూ, వూళ్ళోనూ మాష్టారికి అంత అగౌరవ పరిస్థితి ఎందుకొచ్చిందో అంతటి అప్రతిష్ట ఎలా చుట్టుకుందో, నాకెంత ఆలోచించినా బోధపడలేదు.

శవ జాగరం ఒక్కణ్ణే చేసాను. నాకేమీ భయం వెయ్యలేదు. మాష్టారి పండు [illegible] పాకు వంటి శరీరం, పలిత రోమాలూ, వాడిరి పోయిన కాళ్ళూ- చేతులూ, అన్నిటికన్న ముఖ్యంగా ఆ విశాల ఫాల భాగం, ఇవన్నీ చూస్తూ పాత రోజులు జ్ఞాపకం తెచ్చుకుంటూ రాత్రంతా గడిపాను.

సాయంత్రం అయిదున్నరకి మాష్టారు నన్ను చూస్తూ [illegible] మా[illegible] వెల్లివిరియగా ఏదో చెప్పబోయి. చెప్పలేక- అలా కళ్ళు మూసారు.

ఆయన నన్ను రమ్మని ఎందుకు పిలిచారు? ఆయన చెప్పాలనుకున్న ఆ ముఖ్య విషయం ఏమిటి? వీటికి సమాధానం లేకుండానే,

మాష్టారు తరలిపోయారు.

ఎటూ తేలని ఆలోచనలతో. నా చిన్నతనం మాష్టారి ఇంట్లో నేను గడిపిన మధురమైన రోజులు కళ్ళముందు మెదిలాయి.

నా చిన్నప్పుడు, మాష్టారూ - మేమూ ఒక వూళ్ళోనే వుండే వాళ్ళం. ఆయనకు గౌరీపతి ఒక్కడే కొడుకు. అతను మాకు సీనియర్. భార్యపోగా మాష్టారే అతణ్ని అతిగారాబంగా పెంచి, పెద్ద చేశారు.

నేను అంటరాని వాడినైనా, ఆ భావం తాను ప్రదర్శించక పోవడమేగాక, నాకుకూడా స్ఫురించకుండా వుండేటట్టు ప్రవర్తించేవారు. పాఠాలు చెబుతున్నప్పుడు తన పక్కనే కూర్చోబెట్టుకునేవారు.

ఒకసారి చెప్తే, నాకు పాఠాలు బోధపడేవి కావు. అయినా విసుక్కోకుండా, నాకు బోధపడేవరకూ ఆయన చెప్పేవారు. రాత్రిళ్ళు బుడ్డి దీపం పట్టుకుని, మాష్టారింటికి వెళ్ళేవాణ్ని, బైట అరుగుమీద కూర్చుని, చలిలో వణుకుతూ పాఠాలు చదువుతూండే వాణ్ని చూసి — 'ఏరా.. లోపలికి రాకుండా అక్కడ కూర్చుని చదువుకుంటున్నావేం?.. లోపలికిరా..' అని గదమాయించేవారు.

'మీరూ, అబ్బాయిగారూ— భోంచేస్తున్నారనీ...' అర్థోక్తిలో ఆగిపోయేవాణ్ని,

'అయితే, మేం భోంచేస్తూ వుంటేనేకేం? అలాంటి మాటలు నాదగ్గర అనకు. గౌరీపతిని, అబ్బాయిగారని ఇకనెప్పుడూ పిలవకు. వాడు నీ స్నేహితుడు. మీ రిద్దరూ ఇంచుమించు సమవయస్కులు. వాణ్ని పేరుతో పిలు బోధపడిందా?' అని అనేటప్పుడు ఆయనలోని ఔన్నత్యం ఆ నాటి నా ఎదగని ఎదకు బోధపడలేదుగాని ఆ తర్వాత తలుచుకుంటే ఆ మహామనీషికి హృదయంలోనే నీరాజనార్పించాను.

హైస్కూలు చదువంతా మాష్టారి చలవతోనే అయిపోయింది. అప్పటికే గౌరీపతి పట్నంలో కాలేజీలో జాయినయాడు. మాకు ఆ వూళ్ళో తిండి గడవటం కష్టమై పోయి, నాన్న మరో వూరు పోదామన్నాడు. మాష్టారు ఈ మాటలు విని ఎంతో బాధపడ్డారు.

'ఒరే అప్పారావ్ నువ్వు బుద్ధిమంతుడివి. శ్రద్ధగా చదివి పైకిరా. అంతేగాని, ఈ పనీ ఆ పనీ చేసి చదువు మానుకోకు. నువ్వు మంచి హోదాగల ఉద్యోగస్థుడవై నాకు కనబడాలి. తెలిసిందా? అనకూడదేమోగాని, నేను రాలిపోయేలోగా నిన్ను మంచి పొజిషన్‌లో చూడాలి. అదే నా కోరిక. నా ఆశీస్సులు నీకు ఎప్పుడూ వుంటాయి. వెళ్ళిరా' అని ఎంతో బాధతో సాగనంపేరు.

మా నాన్న, అమ్మ, అక్క, నేను అంతా కలిసి జీవనభృతికి దేశాల పాలైనాం.

తర్వాత నాటికి నేడు మాష్టార్ని ఈ వూళ్ళో ఈ దశలో చూశాను. ఆయన ఆ వూరికి వచ్చి రెండేళ్ళైందిట.

గౌరీపతి గురించి వాకబు చేశాను. ఏదో పరాయి రాష్ట్రంలో వుంటున్నాడని, వివాహమైందని తెలిసింది.

మాష్టారి మరణవార్త అతనికి తెలియజేద్దామని చిరునామా కోసం ప్రయత్నిస్తే, 'ఈ శవ దహనంచేసి, వాడికి కూడా కుల భ్రష్టత్వం సంక్రమింప జెయ్యడం దేనికి? అయినా బ్రహ్మయ్య చేసిన ఛండాలపు పనికి వాడు వచ్చినా ఇటుకేసి రానని చెప్పి, మరీ వెళ్ళిపోయాడు...' అని అన్నారు వీధి చివరి సోమయాజులుగారు.

ఎలా అయితేనేం, గౌరీపతి చిరునామా సంపాదించి, అతనికి టెలిగ్రాం ఇచ్చాను. అతను వస్తాడేమో అని ఆ మర్నాడు మధ్యాహ్నం వరకూ చూశాను. రాలేదు.

శవాన్ని అలా ఎంతసేపు వుంచటం? వాహకుల కోసం ప్రయత్నించి, విఫలమై — పంచాయతీ ఆఫీసుకి రిపోర్టు యిచ్చాను.

సర్పంచ్ పాపం విచారించి— 'ఏటోనండి బాబూ! ఇంత బతుకూ బతికిన పంతులుగారి శవం ఎత్తటానికి కూడా యెవ్వరూ రాటంలేదు. అతగాను అలాంటి పని చేసి వుండక పోవల్సింది. సివరి రోజుల్లో ఆయన కలాటి బుద్ధి ఎందుకు పుట్టిందో? కన్న కొడుకు కూడా కాదనుకున్నాక, మరి ఇతర్లకేటి కావాలండి? ఏదో దేవుడు పంపినట్టు పంతులుగారి స్టూడెంటునని సెప్తున్నారు. మరేం చేద్దామంటారు?...' అన్నాడు.

'మాష్టారూ... అంత కాని పని ఏం చేశారు మాష్టారూ' అని గట్టిగా— వినిపించని, కనిపించని ఏ లోకాలకో వెళ్ళిపోయిన మాష్టారిని అడగాలని అనిపించింది.

'మా మేష్టారేం చేశారండీ?' — తెగించి సర్పంచిని అడిగాను, ఏం వినాల్సి వుంటుందో అనే బెంగతోనే!

'ఏం చేస్తే ఏం గానీ, ముందు శవ




దహనం గురించి ఆలోచించండి... యెవ్వరూ లేకపోతే, వెట్టి వాళ్ళని పంపిస్తాము. చెప్పండి మరి. ఇంత పెద్ద మహాతారి పంతులు...' అన్నాడు సర్పంచి, అంత లావు చుట్ట వెలిగిస్తూ.

గుండెలమీద సమ్మెట పోట్లు పడ్డట్టైంది.

'అయ్యో - మాష్టారూ! అజ్ఞాన మనే చీకటిని తొలగించి, అనేక వందల ఇళ్ళల్లో విజ్ఞాన జ్యోతులు వెలిగించిన మీకా- చివరికి ఇలాంటి దుస్థితి పట్టింది! అయితేనేం మాష్టారూ! మీరు ఎవర్ని ఎక్కువగా ప్రేమించేవారో — వారే మీ చివరి మజిలీకి కూడా వాహకులుగా తోడుగా వస్తున్నారు...' అనుకున్నాను.

సర్పంచి కబురు చెయ్యగా, ముగ్గురు మనుషుల దొరికారు మరి నాలుగో కొమ్ము ఎలా?

ఆలోచించి 'నేనులేనూ?' అనుకున్నాను. మాష్టారి శవాన్ని పాడెకుకట్టి, మేం నలుగురం మోసుకు వెళ్తుంటే, ఆవీధిలో వున్న అగ్రకులస్థు లందరూ—

'ఎలాటి పని చేస్తే, అలాంటిఫలితమే దక్కుతుంది'

'హౌటన్ వాసిన ప్రాత కన్న కూడా మాసేండర్ని చింతించిన్' అని తలోకరూ తలో విధంగా నిందించారు.

**Statement about ownership and other particulars about newspaper**

**ANDHRA SACHITRA VARA PATRIKA**

FORM IV (See Rule 8)

1. **Place of Publication :** Vijayawada
2. **Periodicity of its Publication :** Weekly
3. **Printer's Name :** Sri S. Nageswara Rao
   Whether citizen of India : Yes
   Address : 16, Luz Avenue, Mylapore, Madras-4
4. **Publisher's Name :** Sri S. Nageswara Rao
   Whether citizen of India : Yes
   Address : 16, Luz Avenue, Mylapore, Madras-4
5. **Editor's Name :** Sri S. Radhakrishna
   Whether citizen of India : Yes
   Address : 16, Luz Avenue, Mylapore, Madras-4

Names and addresses of Individuals who own the newspaper and partners or share holders - holding more than one percent of the total capital :

| Names | Addresses |
|---|---|
| 1. Mr. S. Radhkrishna, | 16, Luz Avenue, Mylapore, Madras-4 |
| 2. Mr. S. Nageswara Rao | Do |
| 3. Mrs. S. Kamakshamma | Do |
| 4. Mrs. S. Rajeswari | Do |
| 5. Mrs. S. Seshamma | Do |
| 6. Mr. S. Sreeramamurty | 14/15, Luz Church Road, Madras-4 |
| 7. Dr. P. S. N. Murthi, | P. O. Yellamanchili, Vizag Dt. |

I, S. Nageswara Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**S. NAGESWARA RAO**
1-3-1977 Signature of Publisher.

## వాహకులు కావాలి

'చూడవె మంగతాయారూ! చేసినపనికి చివరికి వెట్టి వాళ్ళు వచ్చి ఈడ్చు కెళ్తున్నారు బ్రహ్మయ్యశవాన్ని' అని, సోమ యాజులు గారి భార్య అనడం స్పష్టంగా నా చెవిని పడింది.

మాష్టారి శవాన్ని మోస్తున్న మిగిలిన ముగ్గురూ ఆవూళ్ళో అందరికన్నా ఉన్నతంగా కనిపించారు నాకు.

వాళ్ళని వెట్టివాళ్ళని చులకనగా అన్న వాళ్ళు వెర్రి వాళ్ళు వాళ్ళ చేత వెట్టిచాకిరీ చేయించి, వాళ్ళకి వెట్టివాళ్ళని ముద్రవేసింది, ఈ అహం భావులే! ఆరోజులు పోయాయి. అందరం మనుషులమే, జగతిలో జాతులు రెండే. అవి ఆడ—మగ. మిగతా అన్ని జాతులూ మన కుంచె నుంచివచ్చిన వర్ణాలే - అని మనసులో అనుకున్నాను.

* * *

మాష్టారి శవం పూర్తిగా పంచభూతాల్లో కలిసిపోయింది. కణకణలాడుతున్న చితివద్దకు వెళ్ళి,అత్యంత పవిత్రమైన ఆ అగ్నిలోకి చూసి 'మాష్టారు!మీరూ ఇంత పవిత్రమైన వారేనే! అయితే, మిమ్మల్ని లోకులెందుకిలా నిందిస్తున్నారు మాష్టారూ' అనుకుని ఆ చితాగ్నికి అంజలి ఘటించి వెనుదిరిగాను.

'పంతులు బాగానే వుండేవోడయ్యా! కొడుక్కి పెళ్ళి చేశాక మళ్ళా ఇతగాడికి ఆడదానిమీద మనసు మళ్ళింది గాబోలు. అంత ముసలి వొయస్సులోనూ కులంగాని కులందాన్ని తెచ్చి కులకడం మొదలెట్టాడు. అంతే. బురదలో కూరుకుపోయాడు' ఎవరో అంటున్న మాటలు విని నమ్మలేకపోయాను.

'మాష్టారేమిటి? ఇలాంటిపని చెయ్యడ మేమిటి? ఇందులో ఏదో విడదియ్యలేని రహస్యం వుండితీరాలి' మాష్టారు అలా చిన్నటికీ చెయ్యరు. అనుకుని, ఆ మాట్లాడు తున్న వాళ్ళదగ్గరికి వెళ్ళి మాష్టారు గురించి వివరంగా చెప్పమని అడిగాను.

'ఇందులో సెప్పడానికేటుందండి?అతగాను మొగాడు కాదేటి, అప్పంగా మంచి వొయసులోవున్న ఆడదాయిని కాదనడానికి? మాట్లకేట్లోగాని ఇగో ఇక్కడికి రెండు మైళ్ళుంటాది, ఆ మామిడితోపు ఏవకాతల వుంటాది. లచ్చిపురం అక్కడికెళ్ళి అడుగు

[illegible]
యేరైనా సెప్తారు' అని పకపక నవ్వేరు.

వాళ్ల మాటలకి పరమ అసహ్యం వేసింది. మరేం మాట్లాడకుండా లచ్చింపురం బయలు దేరాను.

వెన్నెల రాత్రుళ్ళు కావటంవల్ల తోవ చక్కగావుంది అరగంటలో వూరు చేరి వాకబు చేశాను. వూరికి చివరవున్న పాక చూపించారు.

పాక ముందు నిల్చుని 'ఎవరో లోపల' అని పిల్చాను.

చేత్తో బుడ్డి దీపంతో ఓ స్త్రీమూర్తి తలుపు వంటి తడకతీసి బయటకు వచ్చింది.

ఆమెను చూసి నివ్వెరపోయాను. నేను ఏం చూస్తున్నానో నాకేం అర్థం కాలేదు. నేను నిల్చున్న నేల రెండుగా విడిపోయి లోపలికి కృంగిపోతున్నట్టు ఫీలయ్యాను.

ఆ స్త్రీ ఎవరో కాదు. గత ఏడాది, ఓ రాత్రికి రాత్రికి ఇంట్లో చెప్పకుండా వచ్చేసిన మా అక్క.

నోట మాట రాలేదు.

'అక్కా...నువ్వా...'అన్నాను వణుకుతూ.

'ఏట్రా... అప్పయ్యా... నువ్వ టా... ఎట్రా, ఎలగొచ్చావురా ఇక్కడికి... రారా... లోపలికి రారా...' అంటూ ఆమె నన్ను లోపలికి రమ్మంది. ఇంతలో లోపల పసిపిల్ల ఏడుపు వినపడ్డంతో, ఆమె వెనుదిరిగింది. నేను అనుసరించాను.

నులక మంచం మీద నన్ను కూర్చోమంది ఉయ్యాల్లో బిడ్డని వొళ్ళోకి తీసుకుని, మంచం దగ్గరగా నేలమీద కూర్చుంది, బిడ్డకి స్తన్యం ఇస్తూ.

ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి. దుఃఖం పెల్లుబుకులోంది.

'ఐత్రేటా ...అ'మ్మ, అయ్యా బావు న్నార్రా... నాన్సేసిన బుద్దిమాల్న పనికి ముఖం సెల్లక ఇల్లాగ్గిసి వొచ్చిసి, సావాలను కున్నాను. తోవలో బెమ్మయ్య పంతులని పక్కూర్లో వుంతున్నాగ్నె— ఆయన నన్ను రచ్చించి, సావకూడ దన్నారు. ఎంత సెప్పినా ఇనుకోకండా ఆల్నింటికి తిసికెళిపోవచ్చారు! వూరు వూరంతా ముక్కున ఏలేసుకుంది. బేపనయ్య, సెండాలపుదాన్ని ఇంటికి తెచ్చినా డంటే— ఇంటికి తెచ్చినాడని, గగ్గోలు నెగిసి పోయింది. ఆ మాటలకి నన్ను వొదిలేస్తే, నానెక్కడ నచ్చిపోతానో అని ఆ పంతులుగారు

## 4 3-1977 శుక్రవారం మొదలు
## 10-3-1977 గురువారం వరకు

**మేషం :—** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ప్రయాణాలు బాగుంటాయి. అనవసరమైన సందేహాలు కలుగుతాయి. ఇతరుల నిమిత్తం శ్రమకు గురికాగలరు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. అలంకార వస్తువులు కొంటారు.

**వృషభం :—** మీ కార్యక్రమాలు హడావుడిగా ఉంటాయి. సాటివారిలో గౌరవం లభిస్తుంది. విద్యావైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో మీ అంచనాలు తారుమారు కాగలవు. స్త్రీలకు—పుణ్యకార్యాలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**మిధునం :—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. ప్రయాణాలు వాయిదా పడతాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. మున్ముందు లాభించగల వ్యవహారాల్లో అభివృద్ధిని సాధిస్తారు. స్త్రీలకు— ఆరోగ్యం బాగుంటుంది. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం :—** మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు అందుతుంది. రాజకీయ వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాల్లోను ఫలితం సామాన్యంగా ఉంటుంది. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సంతోషకరమైన వార్తలను వింటారు.

**సింహం :—** ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులకు కల్సుకొంటారు. మీ ఆలోచనలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు లభిస్తాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుంటుంది. బంధుమిత్రులను కల్సుకొంటారు.

# వారఫలం
## మహేష్

**కన్య :—** వ్యతిరేకమైన వార్తలను వింటారు. సాహసిక వ్యవహారాల్లో నష్టం రాగలదు. వారం మధ్యలో మీ కార్యక్రమాలు బాగుంటాయి. వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాలు లాభిస్తాయి. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. అధిక వ్యయం జరుగుతుంది.

**తుల :—** వృత్తి వ్యాపారాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. రావలసిన డబ్బు అందుతుంది. వారం మధ్యలో చికాకులు కలుగుతాయి. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి. స్త్రీలకు—ఆరోగ్యం బాగుండదు. సాహిత్య కళా రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**వృశ్చికం :—** ప్రయోజనంగల సంభాషణలను జరుపగలరు. ప్రయాణాలు ఫలిస్తాయి. సాహసిక వ్యవహారాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. వారం ఆఖరులో యెవరినీ విశేషంగా నమ్మడం తగదు. స్త్రీలకు—కుటుంబ వ్యవహారాల్లో శ్రమకలుగుతుంది. దైవ కార్యాలు నెరవేరతాయి.

**ధనుస్సు :—** ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభకార్యాల విషయంలో అనుకూలత లభిస్తుంది.

**మకరం :—** చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోవచ్చును. వృత్తిలో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో అనుకూలమైన వార్తలను వింటారు. విద్యా వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**కుంభం:—** ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేరుతుంది. సాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగుతుంది. వ్యాపారంలో చికాకులు ఏర్పడతాయి. వారం ఆఖరులో అనుకూలమైన మార్పులు వస్తాయి. స్త్రీలకు — ఆరోగ్యం బాగుండదు. వినోద కార్యక్రమాల్లో పాల్గొంటారు.

**మీనం :—** రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. సాటివారితో మాట పట్టింపులు తగవు. ఆర్థిక వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు. వారం ఆఖరులో మీ తాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. స్త్రీలకు— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ఆడంబరంకోసం వ్యయం చేస్తారు.

---

బయపడి, ఆల్లాంచర్రీ విదిరించి, నన్ను వుండమన్నారు. వారే అప్పయ్యా, నా ఇవరాలడిగి సిర్నామా ఇమ్మని ఒహాటే బలవంతం సేసారు. నానియ్యనని మంకుపట్టు పట్టినాను. సివరకి, ఈ మధ్య నా సంగతి సెప్పక పోతే, తనమీద పెమాణం అన్నారు. సెప్పాను. ఆ పంతులుగోరు ఎంతో ఆచ్చెరపోయారు. నువ్వు ఆ పంతులు బాబుకాడే సదువుకున్నావటకదంట్రా. మన కుటుమానం గురించి అంతా తెల్సుకుని ఎంతో బాదపడిపోన్రా. మనవంతా ఒకూళ్ళోనే వుండిపోళ్ళమని సెప్పారు. నేను అప్పుడు పెద్దమ్మ దగ్గిరుండేదాన్ని కదరా. అందుకు నాకు తెల్దు ఆయన, ఎవురేటన్నా—నిన్ను వొగ్గను. పెసవం వొచ్చేవరకూ ఈడనే వుండమని బలవంతం సేసారు.

బాబుని వూళ్ళో అందరూ ఎలేసేసినారు. బాబుకి మంచినీళ్ళుకూడా దొరక్కుండా సేసారు. నాను బానికాడికెళ్ళకుండా సికాకు పెట్టేరు. ఎన్నెన్ని ఈనమానాలైనాయో సెప్పలేను. అయినా పంతులు బాబుమాత్రం పెసవం అయేవరకూ మాటాడొద్దన్నారు. సివరికి పెసవం అయాక, నేనే అన్నాను ఆ బాబుతో—'ఏరే వుంటాను, సచ్చిపోను-పర్లేదని!—' ఎనగ్గితేనేం బాబు సివరికి వప్పుకుని, ఈవూళ్ళో ఈయిల్లు తీసుకుని, వస్నిక్కడుంచారు. అతగాను మాములుమనిషి కాదరా. దేవుడు....' అంది నిట్టూరుస్తూ.

బిడ్డ వేపు చూశాను. వచ్చగా బంగారంలా వున్నాడు. మాఅక్క వాలాగే బాగా వలువు.

'అయితే ఈ బాబు....'

'ఏటనుగు తావునేరా... పాడుపని జరిగిపోయింది. మునూరి కరణం గోరు.....' ఆగిపోయింది.

* * *

మాష్టారు నాకురాసిన లేఖలోనిఅంతర్యం బోధపడింది. అయన్ని ఆవూళ్ళో అంతా ఎందుకంత చులకనగా చూశారో అర్థమయింది.

గొప్ప సంఘసంస్కర్తల కోవకి చెందిన మాష్టారికి మనస్సులోనే నమస్సులర్పించాను.

# హైదరాబాద్ నోట్ బుక్

## డాక్టర్ చిపుకుల కృష్ణమూర్తికి బోర్లాగ్ బహుమతి

దేశానికి ధాన్యాగారమయిన ఆంధ్రప్రదేశ్ తన గొప్పతనాన్ని వ్యవసాయ శాస్త్ర పరిశోధనలో బహుమతులు పొందడంతో మరొకసారి దేశానికి చాటింది. నోబెల్ శాంతి బహుమతిగ్రహీత డాక్టర్ నార్మన్ బోర్లాగ్ పేర కోరమాండల్ ఫెర్టిలైజర్స్ కంపెనీవారు ఒక బహుమతిని వ్యవసాయ శాస్త్ర పరిశోధకునికి యిస్తారు. ఒక బంగారు పతకం, పదివేల రూపాయలు బహుమతికింద అందజేస్తారు. ఇంతకు ముందు ఈ బహుమతి హైదరాబాద్ శ్రీహిసమన్వయ పథకానికి చెందిన పద్మశ్రీ డాక్టర్ ఎస్. వి. ఎస్. శాస్త్రికి లభించింది. ఈ సారి డాక్టర్ కృష్ణమూర్తికి లభించింది. ఈయన నగరంలోని మెట్ట సేద్యపు పరిశోధనల పథకం డైరెక్టరు. డాక్టర్ చిప్రకుల కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో పట్టభద్రుడై బర్కిలీ విశ్వవిద్యాలయంలో భూమి శాస్త్రంలో డాక్టరేట్ పొందారు. వ్యవసాయ విశ్వవిద్యాలయంలో పరిశోధనల శాఖ డైరెక్టరుగా పని చేసి, ఏడుసంవత్సరాలుగా భారత వ్యవసాయ పరిశోధనమండలికి సంబంధించిన మెట్ట సేద్యం శాఖ డైరెక్టరుగా వుంటూ మెట్ట ప్రాంతం రైతులకు అపారసేవ చేస్తున్నారు. నిజాంసాగరు కింద వరి ఉత్పత్తి తగ్గుస్థాయిలో వుండడానికి కారణం భాస్వరపు లోపమేనని, ఇతర జిల్లాలో జింక్ లోపాన్ని తొలిసారిగా కనుగొన్నవారు ఈయనే. మెట్ట భూముల విషయంలో ఈయనది కూలంకషమైన ప్రజ్ఞ.





## కూలిపోతున్న కాకతీయ ద్వారం

కాకతీయ శిల్పానికి ప్రతీక అయిన వరంగల్ కోట తూర్పు ద్వారం ఒక వైపునకు ఒరిగిపోతున్నది. కూలిపోయే ప్రమాదమూ ఉంది. హనుమకొండలోని వేయి స్తంభాల గుడి మండపం కూడా శిథిలావస్థలో ఉన్నది. ఇవి చాల చారిత్రక ప్రాధాన్యం గలవి. వరంగల్ కోటలోని కాకతీయ శిల్పాలు కూడా ఎండకూ వానకూ చెడి పోతున్నాయి. ప్రపంచ తెలుగు మహాసభ జరిగినప్పుడు డాక్టర్ ఎన్. రమేశన్ కేంద్రప్రభుత్వ పురాతత్వ శాఖ జాయింట్ డైరెక్టర్ జనరల్ డాక్టర్ థాపర్ వరంగల్ వెళ్ళి పరిశీలన జరిపి, రక్షణ ఆవశ్యకతను తెలిపారు. పదేళ్లలోగా పునర్నిర్మాణం అవసరమని తెలిపారు. వీటి రక్షణావశ్యకతను గురించి ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, సాంకేతిక శాఖామంత్రి శ్రీ భాట్టం శ్రీరామమూర్తి కేంద్ర విద్యామంత్రి శ్రీ నూరుల్ హసన్‌కు ఒక లేఖలో వివరించారు.

## కంచు యుగపు నగరం

అల్టీన్—తెపే ఒక కంచు యుగపు నగరం. తుర్క్‌మెనియా దక్షిణాన, కారాకుమ్ ఎడారిలో ఈ ప్రాచీన నగరం కనుక్కోబడింది. 4000 సంవత్సరాల క్రితం వుండిన యీ నగరం 5 వేల వరకు జనాభా కలిగి వుండేది. దీనిని ఒక మిట్టమీద కట్టేరు. నగరం చుట్టూ మట్టి గోడలు వున్నాయి. అందులో రెండు సమాధులు, ఒక దేవాలయ శిథిలాలు కనిపించాయి. ఎన్నో బొమ్మలు, గృహాలంకరణ సామాగ్రి దొరికేయి. రెక్కలు విప్పుకొన్న పక్షి బొమ్మగల ముదికలు దొరికేయి. ఈ బొమ్మ అల్టీన్‌తెపేలో వుండిన మతం యొక్క గుర్తు. అక్కడ దొరికిన ఆసక్తిదాయక వస్తువులలో అదొకటి. సమాధిలో పురావస్తు శాస్త్రవేత్తలకి కంచు, వెండి ఉంగరాలు, నల్లని పూలు దుసులమీద కుట్టే పూసలు దొరికాయి. ఇంకా తవ్వకాలు సాగుతున్నాయి.

## హైదరాబాద్ నోట్ బుక్

### లోక్‌సభకు రాష్ట్రంలోని వోటర్లు

1971 లో జరిగిన ఎన్నికలలో కన్నా వచ్చే మార్చి నెలలో జరిగే లోక్‌సభ ఎన్నికలలో కొత్తగా నాలుగున్నర కోట్ల మంది వోటర్లు— అంటే, మొత్తం దాదాపు 32 కోట్ల లక్షన్నర మంది పాల్గొంటారు. మన రాష్ట్రానికి సంబంధించినంత వరకు మునుపటి ఎన్నికలకన్నా ఒక స్థానంఎక్కువ అయింది. ముందు 41, ఇప్పుడు 42. 1971 లో వోటర్ల సంఖ్య దాదాపు రెండు కోట్ల 27 లక్షలు. ఈ సారి రెండు కోట్ల 75 లక్షలు. అంటేదాదాపు 50 లక్షల మంది ఎక్కువయ్యారు. 42 స్థానాలలో ఆరు హరిజనులకు, 2 గిరిజనులకు ప్రత్యేకించారు గడచిన ఎన్నికలో 41 స్థానాలలో కాంగ్రెస్ 28 స్థానాలను, ప్రజాసమితి పది స్థానాలను, కమ్యూనిస్టులు, మార్క్సిస్టులు, ఇండిపెండెంటు తలో ఒక స్థానాన్ని గెలుచుకొన్నారు కాని, తర్వాత ప్రజాసమితి సభ్యులు, ఇండిపెండెంటు సభ్యుడు కాంగ్రెసులోచేరడంతో కాంగ్రెస్ బలం 39 కి పెరిగింది రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ జనతాపార్టీ ఫిబ్రవరి 2 వ తేదీన కేంద్రప్రభుత్వం మంత్రి పదవికి, కాంగ్రెస్ పార్టీకి రాజీనామా ఇచ్చిన నెహ్రూ సమకాలికుడు పాతకాంగ్రెస్ నాయకుడు జగ్‌జీవన్‌రామ్ నెలకొల్పిన కాంగ్రెస్ ఫర్ డెమోక్రసీ పార్టీ ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగిస్తున్నాయి. మాజీ రాష్ట్ర మంత్రి విధాన పరిషత్తు సభ్యురాలు శ్రీమతి సదాలక్ష్మి కాంగ్రెస్ సభ్యత్వానికి రాజీనామా యిచ్చి జగజీవన్‌రామ్ స్థాపించిన కాంగ్రెస్ ఫర్ డెమోక్రసీ పార్టీలో చేరారు.

### నవ్యనాటకసమితి నృత్యసంగీతోత్సవం

వై. ఎం. సి. ఎ. ఆధ్వర్యంలో నవ్య నాటకసమితి నిర్వహించిన అఖిలభారత నృత్య సంగీతం పోటీలలో గెలుపొందిన వారికి ఫిబ్రవరి 6 వ తేదీన రవీంద్ర భారతిలో బహుమాన ప్రదానం జరిగినప్పుడు ముఖ్య అతిధిగా ఉన్న మునిసిపల్ వ్యవహారాల మంత్రి శ్రీ చల్లా సుబ్బారాయుడు ప్రసంగిస్తూ జంట నగరాలలో మరి కొన్ని రంగస్థలాలు అవసరమని సూచించారు. బొంబాయిలోని లైనోకైప్ మిషనరీ సంస్థ నిర్వాహకులు శ్రీ బాలసుబ్రహ్మణ్యం బహుమతి ప్రదానం చేశారు. సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీ కె. వెంకటరత్నం పోటీలు జరిగిన తీరును వివరించారు. ప్రారంభంలో వై. ఎం. సి.ఎ. అధ్యక్షుడు శ్రీ డి. వి. షా స్వాగతం చెప్పారు. నవ్యనాటక సమితి ప్రధాన కార్యదర్శి శ్రీ వేమరాజు నరసింహారావు నివేదిక వినిపిస్తూ, ఈ సారి పోటీలలో 124 మంది పాల్గొన్నారని వీరిలో 110 మంది బాలికలని అన్నారు. సమితి అధ్యక్షులు శ్రీ వణుకూరు నారాయణరావు కృతజ్ఞత తెలుపుతూ తమ సమితి పన్నెండేళ్ళుగా ఈ పోటీలు నిర్వహిస్తున్నారని ఈ సారి జూనియర్, సబ్ జూనియర్ విభాగాలకు ఎక్కువమంది అభ్యర్థులు వచ్చారని తెలిపారు.

### శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ సూచన

హైదరాబాద్ శివారు గంగవరంలో జనవరి చివరివారంలో జరిగిన సాహిత్య సభలో విఖ్యాత కవి శ్రీ గుంటూరు శ్రీ శేషేంద్రశర్మ ప్రసంగిస్తూ కవి అయినవాడు బాధ్యతతో తన కవితను వెలార్చవలెనని, నవసమాజ సంస్కరణ బాధ్యత కలదని అన్నారు. కవులు జనాన్ని ప్రభావితం చేయక పోవడానికి కారణం ఈ బాధ్యతను గుర్తించక పోవడమేనని అన్నారు. శ్రీమతి ఇందిరాశేషేంద్ర శర్మ సభకు అధ్యక్షత వహించారు. నిజం! కవులు తమ బాధ్యతను గుర్తిస్తే ప్రజలు తప్పక తమ బాధ్యతను నిర్వహిస్తారు. ఈ ఊరికి ఆ ఊరు ఎంత దూరమో ఆ ఊరికి ఈ ఊరూ అంతేదూరం.

ఉపశ్రుతి :

"అమ్మా ! మీారు అక్కా నిలబడకండి, దూసుకోండి" అన్నాడు బస్సు కండక్టరు ఒక మహిళతో. "అదే వాడినే. నిలబెడుతున్నా. రేపు ఎన్నికలలో నిలబడవద్దా మరి? ' అని కండక్టరుకు మందలించారు ఆశ్చర్చిస్తు మిత్రులొకరు.

— తిరుమల రామచంద్ర




తప్పక చూడండి!
కొత్తదనం కోరే
ప్రేక్షకులకు
ఒక వినూత్న
కథా చిత్రం!
ఫిల్మాలయ కంబైన్స్
స్వర్గానికి
నిచ్చెనలు
దర్శకత్వం:
ఎన్.గోపాలకృష్ణ బి.ఎ.,
నిర్మాతలు:
రామచంద్రన్ &
పంజు అరుణాచలం
రఘురామ (తారకరామ)...
శ్రీ తారకరామ...నవభారత్
కృష్ణాజిల్లా హక్కుదార్లు:
ప్రభాత్ ఫిలింస్

సీరియల్

# మగడి కళ్ళ

## పైడిపాటి. సుబ్బరామశాస్త్రి

*(గత సంచిక తరువాయి)*

''బ్రహ్మశ్రీ వేదమూర్తులైన రామబ్రహ్మం గారికి నమస్కారములు చేసి చేయుంగల విన్నపములు :

ఉభయకుశలోపరి.

మీ అమ్మగారికి కూడా నా నమస్కారములు తెలుపవలెను. మీ సంసార విచ్ఛిత్తికి హేతుభూతు లయిన మీ మామగారు స్వర్గస్థులయి కొన్ని నెలలయినదని నమ్మకముగా తెలియుచున్నది. అశౌచ నివృత్తి చేసుకోవలెను. మీ సహధర్మచారిణి సురేఖమ్మ ఏ అన్నగారి ఆశ్రయంలో ఇంతకాలమూ వున్నదో, ఆయనను వదలి విడిగా వుంటున్నది. నా మేనమామ కూతురు సరోజిని, మీ ఆవిడ, ఒకే స్కూలులో పని చేయుచున్నందువల్ల, వివరములు నాకు తెలియుట కవకాశము కలిగినది.

మా సరోజిని వల్లనే, మీ ధర్మపత్ని చాల యోగ్యురాలనీ, భర్తయందు భక్తి గల మనిషనీ, భర్తకు దూరం కావడానికి ఆమె పెద్దలు కారణం గాని ఆమె కాదనీ, తండ్రి గతించాడనీ, అన్నకు దూరమైనదనీ తెలిసినది.

మీరు దయయుంచి, యీ లేఖ పేటేన వ్రాసిన మా మేనమామకూతురి యింటివద్దకు వచ్చినచో, మనము విషయములన్నియు తుణ్ణముగా మాట్లాడుకొనవచ్చును. మీరు ఇక్కడకు ఎప్పుడు వచ్చేదీ, టైముతోకూడా వ్రాస్తే, నేను ఆ సమయమున, తమ దర్శనమునకు సిద్ధముగా వుండగలవాడను.

మీరు నాకిచ్చిన ఆతిధ్యమును మఱువలేను. తమవంటి యోగ్యులకు నాకు తోచిన సహాయము చేయవలయునను అభిలాష కలదు. మీ ప్రధమ భార్య, మీ పుత్రునికి తల్లియై, మీ అమ్మగారికి నేత్రానందము కల్గించి సుఖపెట్టగలదని నా నమ్మకము.

షరా : మీరు చి. సౌ. సురేఖ అభిప్రాయము సుముఖంగా వుంటే, ఆలోచించవచ్చునని లోగడ నాతో చెప్పివుండటంచేత, నేను నా మేనమామ కూతురి ద్వారా విషయము సేకరించి, చొఱవ తీసుకొని మీకు వ్రాసినాను. మీ అమ్మగారూ, మీరూ సంప్రదించుకొని, మీకుకూడా సంసారం పొత్తు చేసుకోవాలనే అభిప్రాయం వుంటేనే రావలెను. తిరిగి జవాబు వ్రాయించవలెను. చిత్తగించవలెను, ''సూర్యం.''

### 22

సరోజిని జాబు చదివి ''బావా! నీ దస్తూరీ బాగానే వుంటుంది'' అంది.

సూర్యం నవ్వాడు.

''నేను గుంట ఓనమాలు దిద్దుకున్నవాడిని. నేలమీద వేలితో అక్షరాలు దిద్దేటప్పటికి, వేలికే ఆ అక్షర పరిజ్ఞానం వచ్చేసింది. తర్వాత పలకమీద దిద్దాను. అక్షరాలు గుండ్రంగా అచ్చులోవలె కుదిరినవనుకున్న తర్వాత, కాగితం, పెన్సిలూ పట్టాను. తర్వాత కలం. కాపీలు వ్రాశాను. కాపీలో పై ఒరవడి ఎల్లా వున్నదో క్రింద అన్ని వరుసలూ అల్లాగే వుండాలనే ప్రతిజ్ఞతో వ్రాసేవాడిని.

దస్తూరీ కుదరడం అసలు ఒక కళ వంటిది. దానిని శ్రీనాధుడు భీమఖండంలో కాబోలు, ఒక ప్రజ్ఞావిశేషంగా వర్ణించాడు. దేనికైనా విషయం, తీరూ, యీ రెండూ ముఖ్యం. తీరుకంటె విషయం ప్రధానమయినా తీరు విషయాకర్షణకు ఎంతో ఉపకరిస్తుంది. దస్తూరీ బాగుండకపోతే, దానిలో యెంత మంచి విషయం వున్నా, అసలు చదవాలనే అనిపించదు. తీరూ, విషయం, రెండూ బాగా వుండడం అనేది ఒక అదృష్టం.

అల్లాగే ఆడవాళ్ళ విషయంకూడా. మగవాళ్ళ

> ***జరిగిన కథ-8:*** కొడుకు సూర్యానికి సరోజినిని యిచ్చి పెళ్లి చేయమని అన్న శేషయ్యని అడుగుతుంది చింపమ్మ. ఆస్థి, చదువు లేని సూర్యానికి సరోజినిని యివ్వ టానికి ఒప్పుకోడు శేషయ్య. ఉన్న ఆస్థి సరోజిని చదువుకి కరిగిపోగా గత్యంతరం లేక హైస్కూల్లో టీచరుగా చేర్పిస్తాడు శేషయ్య. సూర్యం మంచి పురోహితుడుగా పేరు సంపా దించుకుంటాడు. ప్రయివేటుగా ఎం. ఎ. పూర్తి చేస్తుంది సరోజిని. తను తన భర్తకు ఎలా దూరమయ్యిందీ సరోజినికి చెప్తుంది తోటి టీచరు సురేఖ. తమ తన సంపాదన దాచుకోవడం అన్నకి కంటగింపుగా వుందని అతని మాటలవల్ల గ్రహిస్తుంది సురేఖ. సురేఖ తండ్రి మరణిస్తాడు. సురేఖపట్ల పెడసరంగా వుంటుంది వదిన గంగమ్మ. అన్న ఇంటినుండి వెళ్లిపోయి వేరే వుంటుంది సురేఖ. తండ్రి పోయినతర్వాత ఒంటరితనంతో బాధ పడుతుంటుంది సరోజ. సరోజ ప్రోద్బలం మీద వెళ్లిన సూర్యం సురేఖ భర్త రెండో భార్య పోవటంతో ఆమెని స్వీకరించటానికి విముఖతగా లేడని తెలుసుకువస్తాడు. చింపమ్మ మరణిస్తుంది.

విషయంలోకూడాను. దస్తూరీ ఎల్లా ఆకర్షిస్తుందో కొందరు పెళ్లికూతుళ్ళు చూడగానే అల్లా వ్యామోహ పడతారు. అల్లాంటివాళ్ళకు త్వరగా పెళ్లి అవుతుంది. వాళ్ళ అంతస్సులో మంచివాళ్ల కావచ్చు, కాకపోవచ్చు. అంటే అంతః సౌందర్యానికి ముందే బాహ్య సౌందర్యం ఆకర్షిస్తుంది. రెండూ వున్న వాళ్ల అరుదు. ఆకృతి వున్నచోట గుణం వుంటుందని అనేది ఆ అరుదైన వాళ్లనుగురించే.

ఒక వధువు మంచిదా, చెడ్డదా, అని తెలుసు కునేందుకు తగిన సాధనాలు చాలా అల్పం. ఇతర దేశాలలో మోస్తరుగా ఈడేరిన ఆడవాళ్లూ, ఈడు వచ్చిన మగవాళ్లూ, కలిసి మాట్లాడుకోండ్రా అని తల్లిదండ్రులు చెప్పరు. పైగా నిషేధిస్తారు. ఏ స్కూలులోనో, కాలేజీలోనో, తప్పనిసరిగా కొన్ని ముక్కలు మాట్లాడవలసిన అవసరం వచ్చినప్పుడు మాట్లాడడం వేరు. మీరు పెళ్లికోసం మాట్లాడు కోండ్రా అని వాళ్లను స్వేచ్ఛగా వదలివేయడం వేరు. పై మాట్లాడడమనేది, ఒక యింటికి మఱొకరు ఏదయినా వర్తమానం కోసం వచ్చినప్పుడు ఆ ఇంట్లో వున్న కన్య, ఆ మగవాడికి సమాధానం చెప్పడంవంటిది.

అందుచేతనే వధువును ఎన్నుకునేటప్పుడు పెద్దలు ముఖ్యంగా సంప్రదాయాన్ని చూస్తారు. ఇరుగునూ పొరుగునూ, వారి చుట్టాలను, ఆ యింటి పరిస్థితి విచారిస్తారు. అల్లా ఎంతోకాలం విచారిస్తేకాని ఆ పిల్లను చేసుకోరు. అల్లాగే పిల్లను కూడా యివ్వరు. అప్పటికీ మానవ బుద్ధి పొరబడడానికి అవకాశం వుంటుంది కనుక జాతకాలు చూస్తారు వుంటే. జాతకం అనేది మనిషికి అద్దం లాంటిది. దానిని చూస్తే మనిషి సంగతి దాచినా, తెలునుకునేవాళ్లకు తెలిసిపోతుంది.''

''ఈ కాలంలో అందరికీ జాతకాలు వుంటు న్నయ్యా? తల్లిదండ్రులు శ్రద్ధ తీసుకుంటున్నారా జాతకం వ్రాయించి, ఏదయినా దోషం వుంటే పరిహారం చేసుకోవాలని ?''

''అందుకనే సంసారాలు అధ్వాన్నంగా తయా రవుతున్నై. జాతకాలు నప్పనిది వధూవరులకు పెళ్లి చేసేవారు కారు. నక్షత్రాల వైరుధ్యం వుంటే పెళ్లి చేసేవారు కారు.''

''మా నాన్న నాకు జాతకం వ్రాయించలేదు బావా! పుట్టిన తేదీ, టయిమూ, నోటుచేసి పెట్టాడు.''

''దానినిబట్టి జాతకము వేయవచ్చునులే సరోజినీ!''

''దస్తూరీ బాగా వుందని నేనంటే, అశ్వం పోయి అగాధాన పడినట్లుగా, ఎక్కడెక్కడికో తీసుకు వెళ్లావు.''

''కొందరు, మనిషికీ దస్తూరీకి కూడా సంబంధం వుంటుందంటారు. దస్తూరీనిబట్టి మనిషి స్వభావాన్ని చెప్పేవాళ్లున్నారు. ఇంతకీ లేఖ ఎల్లా వుంది ?''

''మాంచి, పకడ్‌బందీగా వుంది. ఒడుపుగా వుంది. నువ్వు శుద్ధ వైదికుడవనుకున్నాను. లౌక్యుడవుకూడా. ఉత్తరం ఎందుకు వ్రాసినట్లు ? నీవే వెడితే పని పూర్తి అయేదేమో!''

''అల్లా చేస్తే పని చెడుతుంది.''

"అదెల్లా ?"

"నేను పరదేశి బ్రాహ్మణుడుగా వెళ్ళి, లోకాభి రామాయణంలో సమాచారాన్ని రాబట్టాను. అందు చేత వాళ్ళ వాళ్ళ మనస్సులో వున్న అభిప్రాయం బయటపెట్టడం జరిగింది. నేను రాయబారిని అని వారు అనుకుంటే వారు మాట్లాడే తీరు వేరుగా వుండేది. నా ఊరు విజయవాడకు దగ్గర కనుక, ఏదో వాళ్లకు ఉపకారం చేసినట్లుగా, జాబు వ్రాయడమే వుచితం. నేను అనుచితమయిన ఆసక్తిని ప్రకటిస్తే, వారికి సురేఖ మీద అపోహ కలుగవచ్చు.

వారికీ నాకూ వున్న అల్ప పరిచయాన్నీ, ఏర్పరచుకున్న అధికమయిన అనుబంధాన్నీ పురస్కరించుకుని, వారికి కావలసిన విషయం వారికి తెలియ పరచాను, సురేఖ అభిప్రాయాన్ని నేను తెలుసుకున్న తీరు చెప్పవలెకదా! దానికి నీ పాత్ర తప్పనిసరి అందుచేత నీకూ నాకూ వున్న బంధుత్వంకూడా చెప్పవలసివచ్చింది. నీ చిరునామా యివ్వడం అన్నిటికీ మంచిది.

మనం, మన విషయమే చూసుకుంటున్నాం కాని, రామబ్రహ్మంగారిది యిప్పుడు ఎత్తే వయసూ కాదు, దించే వయసూ కాదు. వయసు ప్రొద్దు మధ్యాహ్నం వెళ్లిపోయింది. కొడుకు పోషణకోస మయినా ఆయనకు సురేఖ అవసరం వుంది. ఆయన తల్లి రుక్మిణమ్మగారు మన తరపు ప్లీడరుగా వాదించడానికి వీలుగా బందోబస్తు చేసివచ్చాను. ఉత్తరంలో కూడా ఆమె విషయం ఉటంకించాను. ఆయన ఎల్లాగూ తల్లికి ఆ జాబు విన్పిస్తాడు. ఆమె కోడలును తీసుకురమ్మని ప్రాణం తీస్తుంది. తిరిగి జాబు వ్రాయమని వ్రాశానుకదా! తప్పక మనకు అనుకూలంగా జాబు వస్తుంది. అసలు సురేఖ అత్తగారే వ్రాయిస్తుంది. వారికీ విషయంలో మనం ఆసక్తిని కలిగించాలికాని, మనకున్న ఆసక్తి వెల్లడిస్తే కార్యభంగమవుతుంది."

"బావా! నిన్ను విదేశాలకు రాయబారిగా పంపమని సూచిస్తాను!"

"ఎందుకు? యీ బ్రాహ్మణత్వంకాస్తా చట్టుబండలయిపోవడానికా? అయినా రాయబారిగా వెళ్ళేవాళ్ళను, బ్రహ్మచారులను పంపరట! అందుచేత నాకా భయంలేదు. ఇంగ్లీషు బాగా చదువుకుంటే ఆ యిబ్బంది వుండేదేమో! ఇప్పుడది లేదు. నీకు ములగకొమ్మ యెక్కించడం చేతవునుకాని, నన్ను స్తోత్రం చేయకు!"

"నీ చిరునామాకే రామబ్రహ్మంగారిని రమ్మని వ్రాయకపోయావా?"

"నేను ఇంటిదగ్గర యెప్పుడు వుంటానో, యెప్పుడు వుండనో నాకే తెలియదుకదా! ఒకప్పుడు 'ఎమర్జెన్సీ సర్వీసు'కు వెళ్లవచ్చు. అందుచేత నా చిరునామాకు రమ్మనలేదు."

సరోజిని జాబును తిరిగి చదివింది.

"బావా! ఇంగ్లీషు బాగా చదువుకున్నామను కున్నవాళ్లకూడా, ఇల్లాంటి సందర్భాలలో యింత జాగ్రత్తగా జాబు వ్రాయలేరు."

"తెలుగుకంటె యింగ్లీషు గొప్పదనే భావం నీలోనుంచి పోలేదని నీ ప్రసంగంవల్ల తెలుస్తోంది."

"అల్లా! అనుకోకు బావా! మాతృభాష గొప్పదే. కాని ప్రపంచ భాషలో వుండే విశేషన్ని మనం యెల్లా కాదనగలం?"

సూర్యం నవ్వి ఊరుకున్నాడు.

"బావా! యీ జాబును నన్ను పోస్టు చేయమన్నావా? నువ్వే డబ్బాలో వేస్తావా?"

"నువ్వే డబ్బాలో వేయి; కాని వాళ్లకు అందేటట్టు వేయి."

సరోజిని నవ్వింది.

"సమాధానం నీ చిరునామాకే వస్తుంది."

## 23

సురేఖ సవతి మరణానికి విచారిస్తూనే వుంది. సవతి ముక్కూ మొగం ఎరుగదు. అయినా విచారించింది. ఆమె తనకు సవతి. సవతి అంటే వుండ వలసిన భావమే ఆమెకు లేదు. అభిమానము లేదు. ద్వేషము లేదు. తన భర్త రెండవ వివాహం చేసుకుంటే, ఆ వస్తువు, తన భర్తకు దక్కకుండా పోయిందే — అనే విచారం సురేఖలో చోటు చేసుకుంది. ఇంకా విశ్లేషించాలంటే తాను తన భర్తను సుఖపెట్టలేకపోగా, సుఖపెట్టే సవతి కూడా తన భర్తకు దక్కకుండా మరణించిందే — అని విచారం!

పిల్లలంటే సురేఖకు ముద్దు. ఎంతో ప్రేమ. నిజానికి పుట్టింట్లో అంత కాలం వుండగలగడానికి, ఎక్కువ భాగం వాళ్ల పిల్లలమీద ప్రేమయేనని చెప్పవచ్చు! కృష్ణన్న వచ్చినప్పుడల్లా ఉప్మా చేసి పెట్టింది. పుట్టింటినుండి వచ్చేటప్పుడు పిల్లల కందరకు కళ్లు జిగేల్ మనిపించే దుస్తులు కొంది. సరోజిని సినిమాకు తీసుకువెళ్లినప్పుడు సరోజిని నీ సొంత పిల్లలు వుంటే ఎంత ఆప్యాయంగా చూసు కుంటావో అన్నప్పుడు ఈ జన్మకు ఆ అదృష్టమా? అని విచారించింది. గంగమ్మ పెట్టిన హింసలు చెబుతూ సరోజినితో ఎవరి పిల్లలు వాళ్లకు కావాలి కాని ఒకళ్ల పిల్లలు మనకవుతారా అని వాపోయింది సురేఖ. సవతి పిల్లవాడు పుట్టినా, పుట్టిన శిశువు తన భర్త ప్రతిబింబమే కనుక, ఒక్కమాటు ఆ పిల్లవాణ్ణి చూస్తే బాగుండును! అనుకుంది. తన భర్తకు భార్యా వియోగం కలిగిందే అనే కించతో పాటు, తన సవతి మైల స్నానం చేశావన్న తృప్తి కూడా సురేఖలో వుంది.

అసలు ఈ సరోజినికి ఈ మైల కబురు ఎల్లా తెలిసింది? అది సురేఖకు అంతుపట్టలేదు. చెప్పిన క్రొత్తలో అడిగితే తనను అడగవద్దన్నది. తర్వాత ఆమె కొంతకాలం మేనత్త పోయిన విచారంలో వున్నది ఈ ప్రసంగం వచ్చినప్పుడల్లా, మాట దాటవేయడమో, లేక నన్నడగవద్దని అనడమో తప్ప, సరోజిని చెప్పింది లేదు.

సరోజిని దగ్గరకు వెళ్లింది.

"సరో!"

"అక్కా!"

"నేను ఆ విషయం చెప్పడానికే వచ్చాను. ఇవాళనుండి అక్కను కాదు, నువ్వు చెల్లెలవుకాదు. మన యిద్దరి పేర్లూ సకారంతోనే ప్రారంభ మయినై. నిక్షేపంలా పేర్లతో పిలుచుకుందాం!"

"ఇప్పుడేం ముంచుకువచ్చింది?"

"ఇప్పుడేమీ రాలేదు. వచ్చి చాలాకాలమయింది. నువ్వు నాకు మైల కబురు చెప్పినినాటినుండీ వచ్చింది. నేను నీకు నిజంగా అక్కనయితే, నాదగ్గర నువ్వు రహస్యాలు దాస్తావా? అమ్మ! అమ్మ! ఎన్నాళ్లనుంచి గుచ్చి గుచ్చి అడుగు తున్నాను? చీమ కాలంతయినా రహస్యం చెప్పావా? నా భర్త సమాచారం నాకు చెప్పకుండా దాచినదానవు నీవు చెల్లెలివేమిటి? నేను అక్కనేమిటి?"

సరోజిని మాట్లాడలేదు.

"అల్లా చెప్పకుండా వుండడం న్యాయ మంటావా?"

"న్యాయమే!" అని నవ్వి ఊరుకుంది సరోజిని.

"రహస్యంగా వుంచితే నీకు వచ్చే లాభం?"

"చెబితే, నీకు వచ్చే లాభం?"

"నిజమో! కాదో! ఊహించుకుంటాను."

"పోనీ, కాదనుకో!"

"కాదని ఎల్లా అనుకుంటాను? కాని మాట చెప్పి, నువ్వు నాచేత స్నానం చేయించవుకదా!"

"అయితే నిజమని నమ్మకం నీకు వుందికదా"

"ఉంది సరోజినీ! అసలు నీకెల్లా తెలిసింది అని!"

"మా సూర్యంబావ వల్ల తెలిసిందక్కా!"



"ఏమిటే! అల్లాగా!" అని తెల్లబోయింది.

"అయితే మీ బావకూ, మావారికీ ఏమిటే సంబంధం?"

ఇంతలో సూర్యం వచ్చాడు. సురేఖ తన గదిలోకి వెళ్లిపోయింది.

సరోజిని, సూర్యాన్ని, వంట గదిదాకా రమ్మని తీసుకువెళ్లింది. అక్కడ కుర్చీపీట వేసింది. రామబ్రహ్మం దగ్గరనుండి తన చిరునామాకు సూర్యం పేర వచ్చిన జాబు నిచ్చింది.

"రేపేకదా ఆదివారం. మనమేమి చేయగలం? ప్రొద్దున తొమ్మిది గంటలకల్లా ఆయన వచ్చిపడు తున్నాడు తుపాకీ గుండల్లే!"

"వస్తాడు, బాగానే వుంది! ఆయనకేమో మా యింటి ఎడ్రెస్ యిచ్చావు. మా యింటికి తీసుకువచ్చి పెట్టావు. ఆయన వస్తున్నందుకు నేను బాధపడుతూ అంటున్నాననుకోకు. సంతోషం గానే అంటున్నాను.

కాని, నేనేం చెయ్యాలి? నువ్వేం చెయ్యాలి? సురేఖ ఏమి చేయాలి? ఏమీ రిహార్సల్ లేకుండానే, అందరూ తలకొక విధంగా మాట్లాడితే, "పుల్లయ్య వేమవరం వెళ్లనూ వెళ్లాడు, రానూ వచ్చాడు" అన్నట్లవుతుంది. అయిదు నిమిషాలు కూర్చొని ఆయన దారిని ఆయన లేచిపోతే మనకు కార్యభంగం అవుతుంది."

"మనకు కార్యభంగం కాకుండా వుండాలంటే, ఆయన అయిదు నిమిషాలు కాకుండా ఎక్కువసేపు కూర్చొనేటట్లు చేయాలి. మనం రిహార్సల్ చేసు కోవాలి అంతేగా నువ్వు చెప్పేది?"

"అంతే!"

"సురేఖ, నీకు అక్క!"

"అవును!"

"రామబ్రహ్మంగారు నీకు బావ."

"అవును" అన్నది సరోజిని నవ్వుతూ.

"అంటే, వాళ్లు నీకంటె, నాకంటె పెద్ద వాళ్లు."

"అవును. ఎంత గొప్ప విషయం కని పెట్టావు!"

"అల్ప విషయమయినా, అవసరము వచ్చి నప్పుడు, అది గొప్ప విషయమే అవుతుంది."

"ఇంతకీ నువ్వు చెప్పేదేమిటి? అక్క, బావ, పెద్దవాళ్లు!"

"కనుక, పెళ్లికాని నీవు, ఆయనతో ప్రసంగం ప్రారంభించరాదు, ఇల్లాంటి సందర్భాలలో, నాకు పెళ్లికాకపోయినా, మగవాణ్ణికనుకా, కొంత లోకం తెలిసినవాణ్ణి కనుకా, సంభాషణ ప్రారంభింపవచ్చును కాని, దాని పరిణామం ఎల్లా వుంటుందో తెలియదు."

"ఏమిటి, బావా! అంతా గిజిబిజి చేసే స్తున్నావ్?"

"అసలు, ఇల్లాంటి చిక్కులు వచ్చినప్పుడు, రాజయ్య చెయ్యవలసిన పని ఏమంటే, సురేఖను ఆ పల్నాడు తీసుకుపోయి ఆయన వాళ్ల కాళ్లమీద పడి చెల్లెలును కూడా పడవేయించాలి. అది జరుగ లేదు కనుక, మన ప్రయత్నం!"

"ఇంతకీ తేల్చవేం, బావా!"

## హామీ హామీ హామీ

— డా॥ సి. నారాయణరెడ్డి

కూలిన చెట్ల కీళ్లనుంచి
కాలిన ఇళ్ల కంకాళాలనుంచి
మంచుగడ్డల మౌనం నుంచి
మట్టిబెడ్డల మగతనుంచి
పిచ్చికుక్కల పీనుగలనుంచి
పెంటకుప్పల మూలుగులనుంచి
సిగరెటు ముక్కల ఆర్తినుంచి
చిరిగిన శాసనాల కీర్తినుంచి
పొడుచుకొచ్చిన మృత్యువు
తడుతున్నది నా గుండె తలుపు.
'ఏమండీ! ఒక గది కావాలండీ'
ఇదీ ఇదీ దాని పిలుపు.

'మృత్యువుగారూ! రండి రండి
మీకిదే సుస్వాగతం.
ఎన్నాళ్లుగా ఎదురు చూస్తున్నాను;
ఈ గది మీకు శాశ్వతం.

గది బాగుందా? పడుకోండి
ఇదుగో మూస్తున్నాను తలుపు.
ఆదమరిచి నిదరపొండి
లేదిక మీకు మేలుకొలుపు.'

## మగదిక్కు

"కనుక"

"కనుక"

"నేనేదో చెబుతాను, చెప్పినట్లు నువ్వు చేస్తా నంటే. లేకపోతే నువ్వు చెప్పు, నేను చేస్తాను. కానీ యిద్దరిదీ చెరొకదారీ కాకూడదు. నువ్వన్నట్లు కార్యభంగం కాకూడదు."

"అదే నే చెప్పేదీని. కనుక చెప్పు నేనేం చెయ్యాలో."

"ఆయన వచ్చే వేళకు మన మిద్దరమూ ఈ యింట్లోనుండి తప్పుకోవాలి."

"పెద్దమనిషిని యింటికి రమ్మని మనం చేసే పని యిదా?"

"సరోజినీ! ఆహ్వానించేవాళ్లు ఆహ్వానించాలి. మనం తప్పుకొని సురేఖను మన యింట్లో పెట్టేద్దాం."

'నాకోసం ఎవరయినా వస్తే, వాళ్లకు టిఫిన్ సిద్ధం చేశాను. ఇవ్వవలసినది. కాఫీ ఫ్లాస్కులో పోశాను. ఇవ్వవలసినది. నేను ఒక అరగంటలో తిరిగి వచ్చేస్తాను. వచ్చినవాళ్లను జాగ్రత్తగా మర్యాద చేయవలసినది'—

అని సురేఖమ్మకు చెప్పి ఆయన వచ్చే టయిముకు ముందే వెళ్లిపోయి, ఆయన వస్తానన్న టయిముకు అరగంట దాటినతర్వాత, మనం యింటికి చేరాలి. అందాకా మనం బీసెంటు రోడ్డులో, ఏదయినా కొట్లో, ఏ చింతపండో బేరం చేస్తూ, గడియారం చూస్తూ కూర్చోవాలి."

సరోజిని పక పక నవ్వింది.

"బేరం చెయ్యక చెయ్యక చింతపండే బేరం చెయ్యాలా, బావా?"

"పోనీ, ఫేసు పౌడరు. ఏదో ఒకటి! కాలక్షేపం కావాలికదా!"

"ఏదయినా లైబ్రెరీకి వెళ్లి పేపరు చదువుకో వచ్చు కదా!"

"పోనీ! అల్లాగే చేద్దాం. వాళ్లిద్దరినీ కలప డానికి యింతకంటె మార్గం లేదు. వాళ్లు ఇద్దరూ ఎదురుబడాలి. వాళ్ల మనస్సులు మాట్లాడు కోవాలి. క్రియకట్టాలి. అంతేకాని, ఈ లిమిటేషన్ పెట్టిన వ్యవహారంలో, మనమేమీ తలదూర్చలేం. నా ప్లాను బాగుండకపోతే, సరోజినీ! నీ ప్లానుయివ్వు."

"బావా! చెరొకదారీ కాకూడదన్నావుకదా! ఇంతవరకూ నీ దారినే నడుస్తున్నానుకదా! ఇప్పుడూ అల్లాగే. కాని హఠాత్తుగా భర్తను చూస్తే సురేఖ ఏమి చేస్తుంది? రామబ్రహ్మం ఏమనుకుంటాడు? ఇదంతా ఒక సినిమా కథగా వున్నదికాని, వాస్తవంగా లేదు. నువ్వు బాగా సినిమాలు చూస్తావనుకుంటా!"

"మనస్సుకు ఏదో ఒక వినోదం వుండాలికదా!"

సరోజిని ఏదో ఆలోచిస్తోంది. సూర్యంలేచాడు.

"సరే, సరోజినీ! నేను వెడుతున్నాను."

"రేపు ప్రొద్దున మనం కలిసేదెక్కడ?"

"అరండేలు సత్రం దగ్గర వున్న శివాలయంలో."

"అవును. అది నాకు అందుబాటే. గ్రంథాలయంలోకంటె, దేవాలయంలోనే బాగా వుంటుంది. మన పని నిర్విఘ్నంగా కొనసాగాలని భగవంతుడిని ప్రార్థించవచ్చు."

"సరోజినీ! ఇదేదో సినిమా చూసి వేసిన ప్లాను కాదు. ముందుగా సురేఖకు భర్త వస్తున్నాడని చెప్పావనుకో! భయపడుతుంది. మనల్నికూడా అక్కడ వుండమనీ, ఏదో రాజీ చేయమనీ, ప్రాణాలు తీస్తుంది. ఆ రాజీ క్రొత్తవాళ్లమయిన మనవల్ల ఆయనతో అంత తేలికగా అయ్యేదీపొయ్యేదీ కాదు. మనస్సులు మాట్లాడుకుంటేనే పొత్తు సాధ్యం."

"బావా! నీకు భావకవిత్వం కూడా వచ్చు. మనస్సులు మాట్లాడుకోవడంకూడా తెలుసు."

"ఇంకా నాడెం! నీకు అన్నం తినడంకూడా తెలుసని అన్నావుకాదు!" అని సూర్యం బయలు దేరాడు.

సరోజిని నవ్వుతూ సాగనంపింది.

వెంటనే సురేఖ సరోజిని దగ్గరకు వచ్చింది.

"సరోజినీ! మీ బావ నడిగావా? ఆయనకూ మావారికీ పరిచయం ఎల్లాగో?"

"అక్కా! రేపు సాయంత్రానికి నీకు పూర్తిగా తెలుస్తుంది."

"సరే. ఇన్నాళ్లాగాను. ఒక్కరోజు ఆగలేనా?"

**24**

"అక్కా! నేను శివాలయానికి వెళ్లివస్తాను. ఒక అరగంట పైచిల్లర పట్టవచ్చు తిరిగిరావడానికి. బంధువొకరు వస్తారని తెలిసింది. నువ్వు మా యింట్లో వుండి, నేను ఆలయానికి వెళ్లాననీ, వెంటనే వస్తాననీ, వచ్చేదాకా వుండమనీ చెప్పు.

కాళ్ళు కడుక్కోవడానికి నీళ్లిచ్చి, వంట

## ప్రశ్నావళి

—కె. రామలక్ష్మి

టి. కె. ఆర్. — తుని

మా యీ ధర్మసందేహాన్ని తీర్చండి. అంట్లు తోమడం కష్టమా? వంతకాలు పెట్టడం కష్టమా?

★ ఓసారి తోమిచూస్తే తెలిసిపోయే — యీ చిన్న విషయం — పెద్ద ధర్మసందేహమా రాజుగారూ, అయినా — ఏ వృత్తి చేసేవారికది సులభంగానే వుంటుంది — వినలేదా? పేదబాలశిక్ష లోని వాక్యం — అభ్యాసము కూసువిద్య! (శ్రై.

పి. వి. ఎస్. ఎన్. ఆర్. — మోగల్లు

కె. రా. గారూ, మంచిగా బ్రతికేవాడికివి రోజులు కావంటాను. మీ అభిప్రాయం?

★ 'మంచి'కి మీరు చెప్పే అర్థంమీద ఆధార పడి వుంటుంది — 'మంచిగా' అంటే ఓసీగా అని యిక్కడ చెప్పుంటారు — అంటే — ఫ్రీగా అని. అంటే — ఒకళ్లమీదపడి హాయిగా ఏ బాధా లేకుండా సుఖంగా కాలక్షేపం చేయకల్గడం. కానీ కాస్తైనా కష్టపడకపోతే — జీవితంలో 'మంచి' విలువ గ్రహించడం కష్టం.

జి. వి. — ఉప్పలాడ

స్త్రీ పురుషులలో త్యాగం చేయాలంటే — ఎవరెక్కువ అంటారు?

★ అది హీరో హీరోయినులనుపట్టి వుంటుం దండీ, వాణిశ్రీ అనుకోండి — డెఫినెట్‌గా త్యాగా లన్నీ ఆవిడపరంగా వుంటాయి. నాగేశ్వరరావనుకోండి నాచురల్‌గానే — త్యాగభారం ఆయనగారే మోసే స్తారు! ఇక నిజజీవితంలో తీరికూర్చుని త్యాగం చేసినవాళ్లు — వేరు.

ఎస్. బిహెచ్. — సిరిసిల్ల

ఒక్క టెలిఫోను డైరెక్టరీ మినహా అశ్లీలం లేని సాహిత్యం గల పుస్తకం చెప్పగలరా?

★ ఎక్కాలబుక్కు; తెలుగు కాలెండరు! — (సారీ దీనికి వెనుక పుటల్లో మదనకామ గుటికలు— పూరపిమ్మక శేహ్యాలా అంటూ ప్రకటనలుంటాయి కాబోలు.)

డి. పి. — కర్నూలు

తప్పులు లేకుండా స్వచ్ఛంగా మాట్లాడ్డం నేర్చుకోవాలంటే ఎలా?

★ ఒకటి: మాట్లాడేముందు కాస్త ఆలో చించుకోవడం. రెండు: నెమ్మదిగా మాట్లాడ్డం.

కె. ఆర్. — కనుమోలు

కేవలం డబ్బుకోసం నటించే కళాకారులు, డబ్బుకోసం పేజీలు నింపే మీలాంటి రచయిత్రులు యీనాటి సమాజానికి ఏమాత్రం ఉపయోగపడరు.

★ చిత్తం. ఎవరి వృత్తి వారిది. అదే భుక్తికి మార్గం. యీనాడు చేసి బ్రతికేకన్న ఏదో పని చేసి బ్రతుకుతున్నవారికి సమాజంలో చోటుండ దంటే నాకు నమ్మకంలేదు రాజుగారూ; మీ దృష్టిలో తెలియనివాళ్ల కష్టాలు తెలిసినట్టు, పేదవాళ్ల పేగులపై చేతులేసి ప్రమాణం చేసి రాస్తున్నట్టు సమాజంవారి రచనలవల్లే మెప్పుగా వుందన్నట్టు రాసేవాళ్లూ అచ్చు వేసేవాళ్లూ, డబ్బుకోసం రాయడంలేదనా? చేయడంలేదనా!? 'అందరూ ఎంతో కొంత చెప్పదంటు వాగుతారు. కాని కొందరే సగర్వంగా వాగుతారు' అనండి. అర్థం వుంటుంది.

వి. వి. ఎస్. ఎన్. — సికింద్రాబాదు

ఏది రాసినా తప్పులు పట్టేవారికి బుద్ధి చెప్పడం ఎలా కె. రా. గారూ?

★ సింపుల్. తప్పులు వెదకదలిస్తే పైపైనే దొరుకుతాయి — గడ్డిపోచలు పైపై చిరుగాలికే పూగిసలాడిపోవా? మంచి ముత్యం సముద్ర గర్భంలో వుంటుంది. కావాలనుకున్నవాళ్లు లోతుకి దిగక తప్పదు... అక్కర్లేదనుకున్నవాళ్లే గడ్డిపోచలు ఎన్నిక చేస్తూ కాలక్షేపం చేస్తారని — అనుకుని పూరుకోవాలి.

డి. జె. ఆర్. — హైదరాబాదు

కృతజ్ఞతకి బదులెప్పుడూ కృతఘ్నతేనా?

★ అది ఎదుటివాడి లక్షణం. కాని మన లక్షణం కాకూడదు. తమిళంలో అంటారు 'నన్‌డ్రి మరప్పదు నన్‌రదు నన్‌డల్లత్తు అన్‌రే మరప్పదు నన్‌రు' అని. 'మనం — చేసిన మంచి ఆరోజే మరిచి పోవాలి చేసిన మంచి (ఎవరేనా) ఏ రోజూ మరవ కూడ'దని...

కె. కె. ఆర్. — విశాఖపట్నం

సమస్యలూ పరిష్కారాలూ తోరణాలు చేసి అల్లే కథలు మమ్మల్ని చంపుతున్నాయి కె. రా. గారూ.

★ ఏం చేస్తారు చెప్పండి? సమస్యలు ఆలో చింపచేయాలనీ, పరిష్కారాలు అనుసరించతగినవిగా నైనా వుండాలనీ ఆలోచించరు చాలామంది. సమస్యలు ఆలోచింపచేయాలేగాని, బాధ పెట్టకూడ దని నా భావన.

రమణ — కొవ్వూరు

ఈ కాలంలో ప్రేమించి పెళ్లి చేసుకొనే యువతీ యువకులపై మీ అభిప్రాయం.

★ కాస్త వెన్నెముక వున్న తరం తయారవు తోందని సంతోష పడతాను.

---

యింట్లో సిద్ధంగావున్న టిఫిన్, కాఫీ, యివ్వు. టిఫిన్ అలవాటు లేదంటే అక్కడే వున్న చక్కకేళీ అరటిపళ్ళూ, మజ్జిగా యివ్వు. చుట్టానికే ఇమ్మన్నానుకదా, అని, నువ్వు తీసుకోకుండా వుండేవు! ఆయన తిన్న తర్వాత, మిగిలినవి నువ్వే తీసుకో! నా టిఫిన్ కాఫీ అయిపోయింది. నాకు అక్కేపెట్టనక్కరలేదు.'' అని చెప్పి, సురేఖ తన వాటాలోకి వచ్చిన తర్వాత సరోజిని బయలుదేరింది.

''సరే! చెల్లీ! యీమాత్రం చేయలేవా నీకు సాయం? సాయంత్రం చెబుతానన్నది చెప్పాలిసుమా!'' అని సురేఖ హెచ్చరించింది.

సరోజిని నవ్వుకుంటూ, ''సాయంత్రం నన్ను నువ్వు అడగనే అడగవు!'' అంటూ వెళ్లిపోయింది.

శివాలయం దగ్గర సూర్యం సిద్ధంగా వున్నాడు. ఎల్లాగూ ఆలయానికి వచ్చాముకదా — అని ఇద్దరూ దేవతాదర్శనం చేసుకున్నారు. కాని ఆ ఆలయం, తీరుబడిగా కూర్చొని కబుర్లు చెప్పుకోవ డానికి అనుకూలంగా కన్పించలేదు. వైశాల్యంతక్కువ.

దగ్గరలో వున్న మరొక శివాలయానికి వెడదామని బయలుదేరారు. అక్కడకూడా దేవతా దర్శనం చేసి రుద్రపాదాలు స్వీకరించారు. దక్షిణ లుంచారు. సూర్యం ఈశ్వరుడికి అరిటిపళ్ళు ఇచ్చాడు. అర్చకుడు వాటిని నివేదనంచేసి, ఇద్దరకూ చెరొక పండూ ఇచ్చి ''శీఘ్రమే సుపుత్రాప్రాప్తిరస్తు!' అని ఆశీర్వదించాడు. సరోజిని తెల్లబోయింది. సూర్యం ఖంగారుపడ్డాడు కాని, పట్టనట్టుగా ఊరుకున్నాడు.

''ఆలయంలో దేవతాదర్శనం చేసిన తర్వాత, కాసేపు కూర్చొని మరీ యింటికి వెళ్లాలికదా! అందులో మనం ప్రధానంగా కూర్చోడానికే ఇక్కడకు వచ్చాంకదా! కొంతసేపు అల్లా దూరంగా వెళ్లి కూర్చుందాం, రా'' అన్నాడు.

సరోజిని స్తబ్దంగా అనుసరించింది. సూర్యం కూర్చున్న ప్రదేశానికి గజం దూరంలో సరోజిని కూర్చుంది, ముఖం పెడగా త్రిప్పి.

పెడముఖానికి కారణం, శివార్చకుడి ఆశీర్వా దమే, అని సూర్యం గ్రహించాడు. దానికి, తాను హేతువు కాకపోయినా, ప్రక్కనుండడం హేతు వయిందనుకొన్నాడు. సరోజినిమాత్రం సిగ్గుతో కుంగి పోతోంది. అర్చకుడిమీద కోపంతో ఆలోచిస్తోంది:

''ఏమయ్యా! మెడలో మంగళసూత్రం వున్నదో లేదో గమనించకుండా, ఫెళ్లున ఆశీర్వదిం చావే, ఇది నీకు తగునా?'' అని అర్చకుడిని వెంటనే అడిగితే ఎల్లా వుండేది? దానికి అర్చకు డేమనగలిగి వుండేవాడు?

''అమ్మా! విజయవాడలో, సువాసినులు నగలను రక్షించుకోవడానికి, మెడముట్టా చెంగు కప్పుకుంటున్నారు. మెడలో మంగళసూత్రం వున్నదని అనుకుంటాం. నీకుకూడా పెళ్లి అయిన దనుకున్నాను. క్షమించు తల్లీ!'' ఇది ఒక పద్ధతి. ఇంకా యిలాకూడా అనవచ్చు!

''ఇంత ఎదిగిన మనిషి, పెళ్లి కాకుండా, పరాయి మగాడితో ఆలయానికి వస్తుందా, అనుకున్నాను!''

''పెళ్లి నువ్వు ఎప్పుడయినా చేసుకో, నేను ఆశీర్వదించింది పిల్లలు కలగాలని! చేసుకున్న తర్వాతనే దీని అమలు.''

''శీఘ్రంగా సంతానం కలగాలని ఆశీర్వదించడం లోనే శీఘ్రంగావివాహం కావాలనే ఆశీర్వాదంవుంది.''

పై విధంగా, అంటే తన సమాధాన మేమిటి?

ఎంతోసేపు సరోజిని మౌనంగా వుండే టప్పటికి, సూర్యం ఆ నిశ్శబ్ద లక్షణాన్ని భేదించా లనుకున్నాడు. ఇంతలో సరోజిని —

''ఈ అర్చకులకు మంచీ, మర్యాదా, తెలియదు బావా!'' అని అనేసింది.

''నిజం, నిజం, నిజం'' అని ముమ్మారు అనేశాడు సూర్యం తడుముకోకుండా.

ఆ నిజం అనేది, నిజం అయినా కాకపోయినా, ఆ మాటతో చాలా యిబ్బందులు తొలగిపోతాయను కున్నాడు సూర్యం. లేకపోతే 'కారణం ఏమిటి'

(31 వ పేజీ చూడండి)

# సామాన్యుని సఖుడు

లోక్‌సభకు మార్చి 78 దాకా ఆయుర్దాయం పోసిన శ్రీమతి ఇందిరాగాంధీగారు '77 మార్చిలోనే ఎన్నికలకు దింపేస్తుందని గవర్నమెంటులో వున్న హేమాహేమీ నాయకులక్కూడా తెలియదు. జనవరి 3 వ తారీఖున కూడా హోం శాఖ సహాయ మంత్రిగారు "యీ మార్చిలో ఎన్నికలేమిటి? ఉత్త రూమర్‌లు" అంటూ కొన్ని పత్రికలు చేసిన ఢిల్లీ ఊహాగానాన్ని ఖండించేశారు.

ఈసారి లోక్‌సభ లోగడ అయిదుసార్లు ఎన్నుకోబడిన లోక్‌సభలకన్నా ఎన్నో యెక్కువ అధికారాలు శ్రీమతి గాంధీగారి పుణ్యమా అని అందుకున్నది.

పార్లమెంటు చేసే నిర్ణయాలు రాజ్యాంగానికి చేసే మార్పులులాంటి వాటి మీద కోర్టులు 'కి'మ్మనడానికి వీలులేదిప్పుడు.

ఒకసారి ఎన్నికైన లోక్‌సభ ఆయుర్దాయం యీసారి ఆరు సంవత్సరా లుంటుంది.

ఐదేళ్లదాకా మన మొహం చూడకుండా పోయేరనుకున్న ఎం. పీ. లు యీసారి ఆరేళ్లదాకా మన వూసెత్తరు.

గడిచిన పద్దెనిమిది మాసాల్లోను, దేశంలో ప్రపంచం ముక్కున వేలేసుకున్న సంఘటనలు చాలా జరిగాయి. ఎన్ని అయినా ప్రధానమంత్రి అన్నట్లు "దేశంలో సుస్థిరత కాపాడబడటం ముఖ్యం" అన్న ధ్యేయం నెరవేరిందనే చాలామంది అంటున్నారు.

ప్రతిపక్షాలు జైల్లో వున్నాయి, పత్రికల నోళ్ళు కుట్టేశారు; అని విమర్శించేవాళ్ళంటే—సమ్మెలు, హర్తాళ్‌లు కూడా లేవు – నల్లధనాన్ని వెంటాడి వేటాడి వెలికితీశారు. హరిజన గిరిజనాది షెడ్యూల్డు తెగల కులాల అభ్యుదయం మిట్ట మధ్యాహ్న సూర్యప్రకాశం చందాన అభివృద్ధి చెందింది అని సమాధానాలు చెప్పేవాళ్ళున్నారు!

### కారణాలేమిటి?

శ్రీమతి గాంధీ యింత అర్జంటుగా ప్రజల మధ్యకి వెళ్లాలనుకోడం – గడచిన 18 మాసాల చరిత్రను వోసారి తడిమిచూస్తే – ఒకరకంగా అర్థమైపోతుంది ... అర్థం కాదుకూడా.

ప్రజలలో ముఖ్యంగా వెనుకబడ్డవాళ్లమీద శ్రీమతి గాంధీగారికి గొప్ప నమ్మకం ఏర్పడివుంది – దాన్ని రుజూ చేసుకోడం ఒక్కటే కాదు – చిన్న ఖర్లకికూడా తట్టే మరో కొన్ని వైనాలున్నాయి!

ప్రతిపక్షలవాళ్ళూ, జెగజ్జీవనరావ్‌గారూ కూడా ఎమర్జన్సీ ఎత్తేయాలంటున్నారు... కాని లోగడ 1971లో ఎన్నికలు జరిగినప్పుడు కూడా ఎమర్జన్సీ వున్నది – ఇప్పుడు దానికితోడుగా అంతరంగిక భద్రత కోసం ఏర్పడ్డ యింటర్నల్ ఎమర్జన్సీ కూడా జోడైంది.

'76 జూలై ఫస్టున ప్రధానమంత్రి 20 సూత్రాల అమలుకి రెండు వేల నూట అరవై ఒక్క కోట్ల రూపాయలు మంజూరైనాయి.

సంజయ్‌గాంధీగారి ఐదు సూత్రాల ప్రచారానికి ఎంత ఖర్చయిందో "తెల్దు". జైల్లో వున్న ప్రతిపక్షాలు యిప్పుడేగా బయటికొచ్చారు. అంచేత వాళ్లకూ తెలియదు.

ప్రధానమంత్రి, రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతుల ఎన్నికలు 'కోర్టుల' కతీతమైపోయినాక జరిగే తొలి ఎన్నికలు యివి!

'76 సెప్టెంబరు ఫస్టున న్యాయశాఖామాత్యులు శ్రీ గోఖలే రాజ్యాంగాన్ని "ఓ ఉతుకు ఉతికి ఎండేసే" లాంటి 42వ సవరణ బిల్లును పార్లమెంటు ముందు పెట్టారు. '352' మంది చేతులెత్తే శక్తి వున్న కాంగ్రెసు పార్టీకి సి. పి. ఐ. కూడా తోడైంది.

రాజ్యాంగానికి 36కు పైగా ఎన్నో ముఖ్యమైన మౌలికమైన మార్పులను తెచ్చే యీ "చారిత్రాత్మకమైన" సవరణను లోక్‌సభ (366–4) రాజ్యసభ (0–191) వోట్లతో అంగీకారాన్ని తెలిపితే, రాష్ట్రపతి ముద్ర పడి అవి జనవరి 3; '77 నుంచి క్రమేపీ అమలుకు రావడం ప్రారంభమైనది.

ఈ సవరణవల్ల దేశంలో జాతీయ వ్యతిరేక చర్యలనుకున్న వేటినైనా, సుప్రీంకోర్టు కూడా అడ్డం పడకుండా గవర్నమెంటు అణచివేయవచ్చును.

> (20+5) సూత్రాల దోహదంతో 'కోత' కొచ్చినట్లున్న ప్రజాభిప్రాయాల పంటను 12 అంశాల ఎన్నికల ప్రణాళికతో కోసుకుంటానంటున్న ప్రధాని. పోయినసారి [1971లో] ఆమె "ఎన్నికల సమస్య"ను "నేనే... నన్ను ఎన్నుకుంటారా? వాళ్లనా?" అంటూ ప్రజల ముందుకు వెళ్లారు. ఈసారి పరిస్థితి వేరు. గత 18 మాసాల సంఘటనలు కొత్త చరిత్రను "సృష్టించాయి!"



'యువజన కాంగ్రెస్'కి అభ్యర్థుల ఎంపిక నిరాశాజనకంగా వుండవచ్చును ... వాళ్ల "రి యాక్షన్" ఎలా వుంటుందో...?

## —ఎన్నికల కోలాహలమ్!—



'బోలెడు పార్టీలుండకూడదు' అంటూ నాలుగు పార్టీలను కూడదీసిన ధీశాలి...

దేశంలో రేడియో సరేసరి – ఎన్నో పత్రికలు కూడా పీడిత జాతులయొక్క దళితవర్గాలయొక్క 'విడుగల'కై జరుగుతున్న కీర్తిని "శ్లాఘించాయి."

## జనవాక్య సేకరణ లాంటిదే యిది

ఇప్పుడు – శ్రీమతి గాంధీ ప్రజల ముందుకు గడచిన రెండేళ్ల తన సాహస చర్యలను తీసుకుపోయి– వాటికివాళ్ల "ఆమోద వేలిముద్ర"ను వేయించుకోవా లనుకోవటం ఆశ్చర్యకరమైన సంఘటన కాదనే వాళ్ళూ వున్నారు. ప్రజలమీద అచంచల విశ్వాస మున్న నెహ్రూగారి అమ్మాయి 1969 లో కాంగ్రెసు "నిన్ను అవతలికి పొమ్మంటున్నాం" అంటే 'వృత్తం' "చాపం"కన్న యెప్పుడూ చిన్నదే అన్న గణిత సిద్ధాంతాన్ని కాదన్నట్లు – "నేనే కాంగ్రెసు మీరే బహిష్కృతు లం"టూ రెండేళ్లు తిరగకుండా ప్రజల ముందుకు వచ్చిన (1971 ఎన్నికలు) సంగతి మనకి తెలుసు.

## పోలరైజేషన్ నిలిస్తేనే...

ఇవాళ ప్రతిపక్షలవాళ్లు భీష్మాచారి లాంటి జైప్రకాశ్ "నేను రంగంలోకి దిగాలంటే యిదుగో పాత కాంగ్రెసు – జనసంఘం – బి. ఎల్. డి, సోషలిస్టు పార్టీలు ఏకమై ఓ జెండాక్రింద, ఓ 'గుర్తు'తో ఇందిరాగాంధీని ఎదిరించాలనడంచేత గబగబా "పోలరైజై"పోయారు!



"పరిస్థితులు అనుకూలించితే విజయం మాదే–"
సంజీవరెడ్డి – వాజ్‌పేయి

లోక్‌సభను రద్దు చేయంగానే (జనవరి 20) "పండిట్స్" చాలామంది – అక్కర్లేని పార్టీ ఎం. పీ. లకు స్వస్తి చెప్పాలనుకునే శ్రీమతి ఇందిరాజీ యీ పని చేశారనుకున్నారు– అంతా సంజయ్‌గాంధీ ధ్వజం క్రింద "ఉరకలెత్తుంద"నుకున్న "యువజన కాంగ్రెసు రక్తం" లోక్‌సభకు యెక్కుతుంది అనీ అన్నారు. కాని, కాంగ్రెసు ఫర్ డెమోక్రసీ అంటూ శ్రీ 'రామ్' బయటికి వచ్చి – దెబ్బలు తిని తిని వున్న పాత పాత కాంగ్రెసు సింహాలతో చేరి గర్జించడం కొంత కారణంగా – యువజన కాంగ్రెసుకు ఛాన్సు పోయింది. మరో ఆరేళ్ల ట్రయినింగ్ పీరియడ్ దొరికిందనే అనుకోవాలి! "వాళ్ల రియాక్షన్ ఎలావుంటుంది?"

## ప్రతిపక్షాల అతిరధ మహారధులు

ప్రతిపక్షల "స్ట్రాటజీ"లో యీసారి వ్యక్తి దూషణ లేకపోవటం యింతవరకు గమనార్హం అనేవాళ్లు – జనతాపార్టీ అనే చతురస్రం చెదర కుండా వుంటే – ఇందిరా కాంగ్రెసును దెబ్బతీయ నచ్చు అనుకుంటున్నారు.

కాని మొరార్జీగారు "టైము చాలదంటు న్నారు." ఔను! డబ్బుతో పని ఎన్నికలంటే... దేశంలో నల్లధనమంతా గవర్నమెంటు లాక్కుంది – "నిధు" లంటే యింత ఆకస్మాత్తుగా ఎవరివ్వగల రంటున్నారు? దాతల వర్గాలవాళ్ళు.

"ఫండ్స్" "ఎలక్షన్ మిషనరీ" "ర్యాంక్స్" "క్యాడర్" "స్ట్రాటజీ" ఇవన్నీ ఎన్నికల భాష. ఈ "జార్గాన్"లో వున్న ఎన్నో మాటలు కొత్త కాంగ్రెసుకే దక్కుతాయని – తదితరుల గోల సహజమేగా మరి? !

## పెంకుటిళ్లవాళ్లు

మేడలమీద – గుడిసెలమీద మాత్రం శ్రీమతి ఇందిరాగాంధీగారు తమ దృష్టిని కేంద్రీకరించారే గాని మామీద అంటే పెంకుటిళ్లవాళ్లమీద, అద్దె కొంపలవాళ్ల మీద మధ్యతరగతి అనబడే "అన్‌టచ్‌బిల్స్" మీద "శీతకన్ను" వేశారు అనే అసంతృప్తి వర్గం ఉందని అక్కడక్కడా విద్యావంతులు అయినవారు–వినీవినపడనట్లు సణుగుతున్నారు.

రాజ్యాంగ సవరణలు, కోర్టు హక్కులు – ప్రాథమిక సూత్రాలు – మానసిక స్వేచ్ఛ, వాక్ స్వాతంత్ర్యం లాంటి మాటలు యీ వర్గానికి అర్థం అవుతాయేమోకాని ప్రతిపక్షలవాళ్లు ఇవన్నీ వీళ్లకి "కొబ్బరికాయలు" కొట్టి గుజ్జు తీసి యిచ్చేయత్నం చేస్తే – శ్రీమతి గాంధీగారు 70 శాతం నిరక్షరాస్యులున్న యీ దేశంపై "జాదూ" చేసేసి మరోసారి ప్రతిపక్షలమీద నల్లేరుమీద బండై వెళ్లిపోతుందేమోనన్న 'శంక' కూడా వుంది!!

ఇది యిలా వుండగా–"ఫండ్స్" "మానిఫెస్టో" "అడ్జస్టుమెంట్‌లు" (యిదంతా ఎన్నికల భాష – అంటే జార్గాన్) వీటిని తయారుచేయడంలో ప్రతిపక్షలు కూడా – కులమతాతీత ప్రాతిపదికమీద



కార్మికవర్గాలలోగల అసంతృప్తిని క్యాష్ చేసుకోగల సి. పి. ఎమ్. నాయకుడు పి. సుందరయ్య



తిరుగుబాటు చేసిన పాత–కొత్త వృద్ధ సింహాలు ప్రధానమంత్రులు అవ్వల్సినవాళ్లు– జగ్‌జీవన్ – మొరార్జీ అని కొందరంటారు...

కులమత వర్గాల వోట్లను ఆకర్షించాలి. శ్రామిక పాటక జనానికి నాగస్వరం పట్టాలేతప్ప - "రిచ్" క్లాసుని వేడుకోవాలేతప్ప అది వదిలి అసలు పోలింగు కేంద్రానికే రాని "మిడిల్ క్లాసు"ను కాకా పడితే... అంతే సంగతులేమోనన్న 'శంక' ఒకటి –

## పాత లెక్కలు...

బై ది బై–కొంచెం పాత లెక్కలు చూద్దాం... 1962లో కాంగ్రెసుకి 361 సీట్లు లభించాయి – పోలైన వోట్ల శాతం 45 – [దశాంశాన్ని దగ్గిరసా వున్న పూర్ణాంకానికి సవరించేశాం] మొత్తం పోలైన వోట్ల శాతం 55 – '67లో కాంగ్రెసు స్థానాలు తగ్గాయి. 283 – పోలైన వోట్లు 41 శాతం – మొత్తం వోట్లు శాతం 62 వుంది – కాని చీలిక తర్వాత "కాంగీ"కి 352 స్థానాలు 44 శాతం వోట్లు రాగా మొత్తం పోలైన వోట్ల శాతం 56 –

'కాంగీ' తర్వాత 'కాంగో'వే చాలావోట్లు ప్రజల వోట్లు మారగొన్నది – యిప్పుడు – మరో కాంగ్రెసు కూడా "కాంగో"తో చేరి "జనతా" జెండాతో రంగంలో వుండికనుక వోటర్‌లలో 4 కోట్ల మంది కొత్త వోటర్‌లు వచ్చేరుకనుక – ఈసారి పోలయ్యే వోట్లలో అసంతృప్తి కాంగ్రెసు వర్గాలు మితవాద పార్టీలు కలసి ఎంత శాతాన్ని చీల్చగలరూ? అన్నదే మీమాంస తప్ప వీళ్లు అధికార పక్షాన్ని "చీల్చి చెండాడుతారు" అనుకోడం...!?

[తాజా కలం: వారపత్రికలో తాజా కబుర్లు ఎంత తాజాగా చెప్పుకున్నా యివి పాఠకులకు అందేసరికి – ప్రస్తుత పరిస్థితుల్లో మన దేశ రాజకీయ రంగంలోను – క్రికెట్ ఫీల్డులోలాగా అనుకోని సంఘటనలు జరుగనూవచ్చును.

ఇది పూర్తి అయ్యేసరికి ప్రభుత్వ, ప్రతిపక్షలు రెండూ అభ్యర్థుల జాబితాలను కూడా పూర్తి చేయలేదు. అంచేత షరా మామూలే...]

[ వీరాజీ ]

# * సినిమా విశేషాలు *



'సీత గీతదాటితే'లో జయమాలిని

## త్రీ గ్రేట్స్

భారతం గర్వించదగ్గ ఉత్తమ శ్రేణి కళాకారుల్లో మన నాగేశ్వరరావు, రామారావు, శివాజీగార్లు వస్తారు. ఈ ముగ్గురికి యెంతో చలనచిత్ర చరిత్ర వుంది. ఈ ముగ్గురినీ "ఆల్‌రవుండర్స్" అని చెప్పాలి.

"అగ్రత్రయం" కలిసి ఒక చిత్రంలో నటించడం ప్రేక్షకులకు ఎంతటి ఆనందాన్ని యిస్తుందో వేరే చెప్పాలా!

## ఫిబ్రవరి రెండున జరిగిన సంఘటన

సత్య చిత్ర వారి "అడవిరాముడు" స్కోప్ చిత్రంలో వరుసగా యిరవై రోజులు పాల్గొని, జనవరి 31 న మదరాసు కొచ్చిన "నటరత్న" ఫిబ్రవరి రెండున ఒక మంచి నిర్ణయాన్ని తీసుకున్నారు. "అలెగ్జాండర్" పాత్రకు శివాజీని ఎంపిక చెయ్యడం.

"చాణక్య ... చంద్రగుప్త" వర్ణ చిత్రంలో పాల్గొనే తారలు సామాన్యులా!

చాణక్యుడు : నాగేశ్వరరావు, చంద్రగుప్తుడు : రామారావు, అలెగ్జాండర్ : శివాజీగణేశన్, రాక్షస రాజు : సత్యనారాయణ, పర్వతరాజు : ప్రభాకర రెడ్డి. వీరుగాక మంజుల, జయప్రద, రావుగోపాలరావు, పద్మనాభం, రాజబాబు వంటి ప్రముఖులు వున్నారు.

అలెగ్జాండర్ పాత్రలో శివాజీగణేశన్ మార్చి 23 న రామకృష్ణ సినీ స్టుడియోస్‌లో ప్రవేశించగలరని, "నటరత్న" చెప్పారు. ఎన్టీఆర్ గారి సమయస్ఫూర్తినీ, పాత్రధారుల ఎంపికలో ఆయనకున్న ప్రజ్ఞను యీ విలేఖరి మనసారా అభినందిస్తున్నాడు. ముగ్గురు "సూపర్ స్టార్స్" నటిస్తున్న "చాణక్య ... చంద్రగుప్త" చిత్రం "షోలే"వలె విజయాన్ని సాధించడము సాధ్యమే గదా!

## ఎన్టీఆర్ త్రిపాత్రాభినయం

సత్య చిత్ర వారి "అడవిరాముడు" స్కోప్ వర్ణ చిత్రంలో "నటరత్న" త్రిపాత్రాభినయం ప్రత్యేక ఆకర్షణ కాగలదు. శ్రీరాముడుగా, ఏకలవ్యుడుగా, వాల్మీకిగా ఎన్టీఆర్ నటించ, శబరిగా జయసుధ పాత్రధారణ చెయ్యడం గమనించదగ్గ విషయం.

"అడవిరాముడు" చిత్రంలో ఎన్టీఆర్ చేస్తున్న సాహసకృత్యాలు, భయంకర జంతువులతో ఆయన ఫీట్సు ప్రేక్షకులకు నూతనోత్సాహాన్ని కలిగించకమానవు.

శ్రీ సత్యనారాయణ ... సూర్యనారాయణ



నిర్మిస్తున్న "అడవిరాముడు" స్కోప్ వర్ణ చిత్రానికి రాఘవేంద్రరావు దర్శకుడు. జయప్రద నాయిక.

## జనం మెచ్చే జగపతి చిత్రం

జగపతి ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రంపై ప్రేక్షకులు అనేకానేక ఆశలు పెంచుకున్నారు. వారి ఆశలకు "బంగారు బొమ్మలు" స్టిల్సు మరింత ఆశలకు దారితీశాయి.

"నటసామ్రాట్"గారి గెటప్స్‌లో ఎంతో వెరైటీని ప్రేక్షకులు చూచి మురిసిపోతున్నారు. ఆయన వేసిన స్టెప్స్‌కు ప్రజలు అచ్చెరువందగలరు.

విజయవాడ సమీపాన వున్న "మానికొండ"లో రెండు లక్షలు ఖర్చుపెట్టి జగపతి రాజేంద్రప్రసాద్ గారు సెట్టు నిర్మించారు. అక్కడికి వేలాది అభిమానులు వచ్చి, అక్కినేనిగారిని స్నేహ ప్రశ్నలతో పలకరించారు. రాజేంద్రప్రసాద్ గారి నిర్మాణ దక్షతను, ఆయన దర్శకత్వ చాతుర్యాన్ని వచ్చిన ప్రేక్షకులు కొనియాడారు.

"బంగారు బొమ్మలు" చిత్రానికి ఎస్. వెంకటరత్నం, ఎన్. కృష్ణారావు, సంజీవి, మహదేవన్, ఆత్రేయ వంటి ప్రముఖులు ముఖ్య సాంకేతిక శాఖలను నిర్వహించారు.

## అన్నీ వున్న చిత్రం

"బంగారుబొమ్మలు" వర్ణ చిత్రంలో అన్ని వర్గాలను ఆకర్షించే అంశాలు వున్నాయి. ప్రేక్షకు లభిమానించే జగ్గయ్య, సత్యనారాయణ, రావుగోపాలరావు, రాజబాబు, మంజుల, సూర్యకాంతం, ఛాయాదేవి ప్రధాన పాత్రలను పోషించారు.

అబాలగోపాలం చూచి ఆనందించే చిత్రంగా, దర్శకుడు రాజేంద్రప్రసాద్‌గారు "బంగారు బొమ్మలు" వర్ణ చిత్రాన్ని రూపొందించారు. ఏప్రిల్‌లో అన్నపూర్ణా ఫిలింస్ యీ భారీ వర్ణ చిత్రాన్ని విడుదల చేస్తుంది.



'బంగారు బొమ్మలు'లో ఒక దృశ్యం



'గీత సంగీత'లో ప్రభ, శుభ

## మార్చి 20 న అక్కినేని కొత్త చిత్రం

మార్చి యిరవై తెలుగువాళ్లకు పర్వదినం. అక్కినేని ప్రత్యేకమైన శుభదినం. ఆ రోజున "అన్నపూర్ణా"లో మూడోఫ్లోర్ వెలిసే ఆనందదినం.

"ముత్యాల ముగ్గు" వంటి విలువయిన, విజయవంతమైన చిత్రాన్ని నిర్మించిన సుకుమార్ గారు మార్చి యిరవైన తన రెండవ వర్ణ చిత్రాన్ని ప్రారంభించబోతున్నారు.

**బాపు... రమణ... మామ**

శ్రీరామ చిత్ర అక్కినేనిగారితో నిర్మిస్తున్న చిత్రానికి ముళ్లపూడి కథకుడు, బాపు దర్శకుడు, మహదేవన్ సంగీత నిర్దేశకుడు, ఇషన్ ఆర్య ఛాయాగ్రహణ దర్శకుడు. ఈ చిత్రంలో అగ్రశ్రేణి తారాగణం పాల్గొనగలరని, ఎమ్వీయల్‌గారు యీ చిత్రానికి యస్సెట్‌గా వుంటారని తెలుస్తోంది.

**సుడి తిరిగిందో!**

ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ అధినేత శ్రీ ఎ.వి.సుబ్బారావుకు సుడి తిరిగిందో...ఆ ధాటికెవరూ ఆగలేరు.

"అల్లుడొచ్చాడు" చిత్రం నుంచి, సుబ్బారావు గారికి శుక్రదశ ప్రారంభమైంది. "అత్తవారిల్లు" చిత్రం అందరికీ నచ్చింది.

మార్చిలో విడుదలయ్యే "ఆలుమగలు" చిత్రం కనకవర్షాన్ని కురిపించగలదన్న నమ్మకం, యిక్కడ రషస్ చూచినవాళ్లకు ఏర్పడింది.

"ఆలుమగలు" చిత్రం రిలీజు అయిన వెంటనే "అర్ధాంగి" చిత్రం ప్రారంభమవుతుంది.

ఇకపై, యిలాగే సంవత్సరానికి మూడు చిత్రాలను వరుసగా ప్రత్యగాత్మ... రామారావు... గాంధీగార్ల దర్శకత్వంలో నిర్మించే వుద్దేశ్యం ఏ. ఏ. పి. అధినేతకు వుంది.

ఈ సంస్థకు సంగీత దర్శకుడు చలపతిరావు గారికి శాశ్వత అనుబంధం వుంది.

**అనంతనాగ్ అద్భుతం**

ప్రముఖ చిత్ర నిర్మాత దుక్కిపాటి మధుసూదనరావుగారు నిర్మించిన నవలా చిత్రం "ప్రేమలేఖలు", అనంతనాగ్‌కు తెలుగు రంగంలో బంగరు స్థానాన్ని ఆర్జించిపెరుతుంది. అనంతనాగ్ ఎంత మంచి నటుడో, అంత మంచి మేనర్సు వున్న మనిషి అన్నారు, అన్నపూర్ణా పిక్చర్స్ అధినేత.

"ప్రేమలేఖలు" చిత్రంలో మురళీమోహన్, జగ్గయ్య, సత్యనారాయణ, పుష్పలత, శుభ, గిరిబాబు, అల్లురామలింగయ్య, జయసుధ, దీప ముఖ్య పాత్రలను పోషించారు.

"జ్యోతి" చిత్రం తరువాత, దర్శకుడుగా రాఘవేంద్రరావుకు పేరు తెచ్చే చిత్ర "ప్రేమలేఖలు." అన్నపూర్ణా పిక్చర్స్ వారి సిల్వర్ జూబ్లి యియర్ చిత్రం అగు "ప్రేమలేఖలు" త్వరలో నవయుగ ద్వారా విడుదలవుతుంది.





'స్నేహం'లో గోపాలరావు

**శోభన్ చిత్రానికి రాఘవేంద్రరావు**

"చిలకమ్మ చెప్పింది" చిత్రాన్ని ఈరంకి శర్మ దర్శకత్వంలో, బాలచందర్ పర్యవేక్షణలో నిర్మిస్తున్న నిర్మాతలు వెలసాని గోపీ...చేగొండి హరిబాబుగార్లు జులై నుంచి, శోభన్‌తో నిర్మించనున్న వర్ణ చిత్రానికి రాఘవేంద్రరావును దర్శకుడుగా ఎంపికచేశారు.

మార్చి రెండోవారం నుంచి కథా చర్చ.. పాత్రధారుల సెలక్షన్ ... సాంకేతిక శాఖాధిపతుల ఎంపిక జరుగుతుందని, వెలసాని గోపీ చెప్పారు.

శోభన్ ... రాఘవేంద్రరావుల కాంబినేషన్‌కు మినిమమ్ గ్యారంటీ వుంది.

**శ్రీ చిత్ర!**

మదరాసులో తెలుగువాళ్లు, ముఖ్యంగా సినిమా వాళ్లు ఎక్కువగా వసించే స్థలం త్యాగరాయనగరం. ఇచ్చోట శుచికర భోజనాన్ని పెట్టే హోటల్ ఒకటుంది. పేరు సుప్రియ. హోటల్ యజమాని పరంధామిరెడ్డికి చిత్ర నిర్మాణంపై మోజు ఏర్పడింది.

"మృగయా" చిత్రం చూచిన రెడ్డి, మృణాల్‌సేన్‌గారిని తెలుగు చిత్రం చేస్తారా అని అడగడం, ఆయన అంగీకారాన్ని తెలపడం జరిగి నాలుగు మాసాలయ్యింది.

దర్శకుడు మృణాల్‌సేన్ ఫిబ్రవరి నాలుగున మదరాసు కొచ్చి, మూడు రోజులు మకాం పెట్టినప్పుడు, రెడ్డిగారికి కథ ఓ. కే. అయింది.

మార్చి... ఏప్రిల్ నెలల్లో చిత్రమంతా ఆంధ్రా అవుట్‌డోర్‌లో జరపడానికి, దర్శకుడు నిర్ణయించినట్టు, నిర్మాత పరంధామిరెడ్డి చెప్పారు.



'ఆలు మగలు'లో ఒక దృశ్యం.

## జయప్రద వేషాలు

1976 లో రెండు హిట్ చిత్రాలలో నాయికగా నటించిన జయప్రద 1977 లో కూడా హిట్ చిత్రాల నాయిక అయ్యేది తథ్యము అనిపించే విధంగా, ఆమె పాత్రలను అంగీకరించింది.

ఫిబ్రవరి మూడున విడుదలయిన "చక్రధారి"లో జయప్రద వేసిన వేషం చిన్నదే అయినా, చేసిన రెండు సీన్లకు ప్రేక్షకుల అభినందన లభించింది.

ఇప్పుడామె నటిస్తున్న హిట్ చిత్రాలు రామారావుగారి "చాణక్య ... చంద్రగుప్త; సత్య చిత్ర వారి "అడవిరాముడు" స్కోప్ వర్ణ చిత్రం; డి. వి. ఎస్. రాజుగారి "జీవితనౌక" చిత్రం.

## సినిమా

ఇప్పుడున్న యువతరం నాయికలలో జయప్రదకు ఒక స్పెషల్ ఫాలోయింగ్ వుండకపోతే, "అంతులేని కథ ... సిరిసిరిమువ్వ" చిత్రాలను ప్రేక్షకులు ఘనంగా ఆదరించియుండరు.

### భలేపాత్రల ప్రద !

నమ్రత, వినయం ... విధేయత, పెద్దలపట్ల మర్యాద ... మన్నన, పనిలో జాగర్త ... ఏకాగ్రత వున్న జయప్రదకు భవిష్యత్తు బాగుండడానికి వీలుగా పాత్రలుకూడా లభిస్తున్నాయి.

సినీ భారత్ ప్రారంభించిన "భద్రకాళి"లో జయప్రద అపురూపమైన పాత్రను పోషిస్తూంది. ఈ చిత్రానికి త్రిలోక్‌చందర్ దర్శకుడు. మురళీ మోహన్ నాయకుడు.

శ్రీకాంత్ ప్రొడక్షన్స్ ప్రారంభించిన "అందమే ఆనందం" చిత్రంలో జయప్రదకు గమ్మత్తయిన పాత్ర లభించింది. ఈ చిత్రానికి సింగీతం దర్శకుడు ... రంగనాథ్ నాయకుడు.

శ్రీ చరణచిత్రలో జయప్రదకు చక్కటి పాత్ర నిచ్చారు, దర్శకుడు బాపయ్య.

### ఎస్. వి. ఎస్. కు సంకొత్త కథ

తెలుగు చలన చిత్ర రంగంలో కొత్త బాటను సృష్టించిన "ప్రజాదర్శకుడు" దాసరి, తన చిత్రా

లకు ఎన్నుకునే కథావస్తువుపట్ల ఎంతో జాగ్రత్త వహిస్తారు.

స్వర్గీయ జగన్నాధరావుగారి పేరు వినని వారుండరు. ఆయన స్థాపించిన ఎస్. వి. ఎస్. పిక్చర్స్‌ను తెలియనివారుండరు.

వారి కుమారులు తండ్రిని మించిన ప్రయోజకులు. వారు దాసరిని దర్శకుడుగా ఎంపిక చేశారు.

ఎస్. వి. ఎస్. పిక్చర్స్‌కుగాను, దాసరి సరికొత్త కధను సృష్టించారు. ఈ చిత్రంలో సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, షావుకారు జానకి, శ్రీవిద్య ప్రధాన పాత్రలను పోషించగలరని, కొందరు కొత్త వాళ్లకు అవకాశం యివ్వబోతున్నారని, దర్శకుడు దాసరి తెలిపారు.

ఈ చిత్రానికిగాను "పద్మశ్రీ" నారాయణ రెడ్డిగారు రెండు పాటలను ఫిబ్రవరి మొదటి వారంలో యిచ్చారు. రమేష్‌నాయుడు సంగీత సారధి.

### ప్రకాశరావుగారి "ద్రౌపది"

"యశోదా కృష్ణ" వంటి విలువయిన చిత్రాన్ని నిర్మించిన నిర్మాత చెరుకూరి ప్రకాశరావు గారికి పురాణ కథలపై మక్కువ ఎక్కువ. ఆయన చదవని యితిహాసం, ఆయనకు తెలియని పురాణ ఆధార గ్రంధముగాని లేదంటే అతిశయోక్తి లేదు.

ప్రకాశరావుగారికి "ద్రౌపది" తీయాలని ఎప్పట్నుంచో వుంది. ఈమధ్య ఆయన శబరిమలై వెళ్లొచ్చారు కూడా. ఆ రోజుల్లో ఆయన్ను "ద్రౌపది"ని గూర్చి అడిగాను.

"ఏప్రిల్ నుంచి నిర్మించాలనుకొంటున్నాను" అన్నారు శ్రీకృష్ణ పాత్రధారి (రామకృష్ణ) ప్రక్కనున్నప్పుడు.

కృష్ణుడుగా, శ్రీరాముడుగా, శ్రీనివాసుడుగా రామకృష్ణ సరిపోగలడని ధైర్యం చేసి విజయు డయ్యారు, ప్రకాశరావుగారు.

"ద్రౌపది"లో రామకృష్ణ కృష్ణుడుగా నటిస్తారు.

### ఎమ్. ఎస్. తీసిన మంచి చిత్రం

అభిరుచి వున్న చిత్ర నిర్మాతల్లో ఎమ్. ఎస్. రెడ్డిగారొకరు. ఎంత మంచి నిర్మాతో, అంతటి కవితా సంపద ఆయనకు వుండడం గమనించదగ్గ విషయం.

కౌముదీ పిక్చర్స్ నిర్మించిన "ముత్యాల పల్లకి" వర్ణ చిత్రాన్ని స్థానిక ప్రముఖు లనేకులు చూచారు. అందరూ అన్నది ఒకటే :

"ఎంత మంచి చిత్రాన్ని తీశారు.
ఎంత మంచి కథను ఎంపిక చేశారు.
ఎంత మంచి పాటలను సృష్టించారు.
ఎంత గొప్ప మాటలను సమకూర్చారు."

ఈ చిత్రంలో మల్లెమాల కధా సంపదను కవితా సంపదను అందరూ అభినందిస్తారు.

నటీనటులందరూ... రాజబాబు... నారాయణరావు... చక్రపాణి... జయసుధ... రోజారమణి... పండరీబాయి మరియు జగ్గయ్యగార్లు అద్భుతంగా నటించారు. దర్శకుడు బి. వి. ప్రసాద్‌కు "ముత్యాల పల్లకి" ప్రయోజనకారిగా వుండగలదు.



'జీవిత నౌక'లో మధు, శోభన్

## గోపీనాథ్ గారి కొత్త చిత్రం

''నటసామ్రాట్''తో, ''ఊర్వశి''ని కలిపి ఒక మంచి చిత్రాన్ని అందించిన దర్శక ... నిర్మాత ఎస్. ఎస్. గోపీనాథ్ గారు, యీసారి ఒక వినోద భరిత చిత్రాన్ని తలపెట్టారు.

చిత్రం పేరు ''తల్లే దైవము.'' కథను, చిత్రానువాదాన్ని, దర్శకత్వాన్ని గోపీనాథ్ నిర్వహిస్తున్న యీ కుటుంబగాథా చిత్రానికి కృష్ణమోహన్ (సంభాషణలు) వ్రాస్తున్నారు.

ఈ చిత్రానికి చలపతిరావు సంగీతాన్ని, జి. కె. రాము ఛాయాగ్రహణాన్ని, కృష్ణమూర్తి ప్రొడక్షన్ను నిర్వహించగలరని, ముఖ్య పాత్రధారుల

## సినిమా

ఎంపిక మరో పదిరోజుల్లో పూర్తవుతుందని, నిర్మాత గోపీనాథ్ చెప్పారు.

''నటరత్న''తో ''రాముని మించిన రాముడు'' ''నటసామ్రాట్''తో ''మహాత్ముడు'' చిత్రాలను నిర్మించి, దర్శకుడుగా పేరు తెచ్చుకున్నది ఎంత వాస్తవమో, పరిశ్రమలోని అన్ని శాఖలను అంత బాగా జీర్ణించుకున్నదికూడా నిజమేనన్నది, యీ విలేఖరి అభిప్రాయం.

''తల్లే దైవము'' చిత్రాన్ని పూర్తిచేసిన తరువాత, ''నటసామ్రాట్''తో ''న్యాయమూర్తి'' వర్ణ చిత్రాన్ని నిర్మించే వుద్దేశ్యం గోపీనాథ్‌కు వుంది.

ఈ చిత్రానికి తమిళ రచయిత ధర్మరాజా కథను యిచ్చారు. అక్కినేనితో చిత్ర నిర్మాణం ఎంతో ఆనందాన్ని యివ్వగలదన్న అనుభవాన్ని, గోపీనాథ్ వ్యక్తపరచారు.

''మహాత్ముడు'' చిత్రం తనకు సంతృప్తి నిచ్చిందని కూడా, రాజేశ్వరీ చిత్రాధినేత చెప్పారు.

### గాయకునికి ప్రశంసలు

చిరంజీవి రామకృష్ణకు (నేపథ్య గాయకుడు) కొత్త సంవత్సరం ఆశాజనకంగా ఆరంభమైంది. ''నటరత్న'' నిర్మించిన ''దాన వీర శూర కర్ణ''లో కృష్ణుడికి పద్యాలు పాడి, స్వర్గీయ ఘంటసాలను గుర్తుకు తెచ్చాడు.

''నటసామ్రాట్''కు ''చక్రధారి'' చిత్రంలో అన్ని పాటలు పాడి, ప్రేక్షకులచేత ''గొప్పవాడు'' అనిపించుకున్నాడు.

ఎన్టీఆర్‌గారు...ఏ.ఎన్.ఆర్. గారు రామకృష్ణ వాయిస్‌పట్ల నమ్మకాన్ని, తృప్తిని వ్యక్తపరచారు.

రామకృష్ణ కూడా యింకాస్త జాగ్రత్తగా వుండగలిగితే, భవిష్యత్తులో మరిన్ని పాటలు జనరంజకంగా పాడి, కలకాలం ప్రముఖ గాయక నాయకుడుగా రాణించవచ్చు.

''పద్మశ్రీ'' బాలమురళీకృష్ణగారి వద్ద, చిరంజీవి రామకృష్ణ శిష్యరికం చెయ్యబోతున్నాడన్న వార్త ప్రేక్షక శ్రోతలకు ఆనందమేగదా !

— శ్రీనివాస్

అని తాను ప్రశ్నించాలి. ఆమె అర్చకుడి మాటలను సమాధానంగా చెప్పాలి. అది ఒక ఇరుకు పరిస్థితి అప్పుడు సిగ్గు రావచ్చు. కోపం రావచ్చు. ఆడవాళ్లకు ఏ సమయంలో ఏ భావం వస్తుందో ఊహించడం కష్టం. ఈ చిక్కులన్నీ 'నిజం' అనే ఒక్కమాటతో విడిపోతాయి. తాను ఏకీభవిస్తే ఆ మహిళ ఎంతో సంతోషిస్తుంది!

సరోజిని ఆపైన ప్రసంగం పెంచలేక పోయింది. సూర్యం మీద ప్రత్యేకం కోపం లేకపోయినా, కోపం వున్నట్లుగా ఇక ఆమాత్రం కూడా భీష్మించుకొని కూర్చోనక్కరలేదు.

''సరోజినీ! యీ మంచీ, మర్యాదా, లేని అర్చకుడున్న ఆలయంలో మనం కూర్చొనేకన్న, మన యింటిదగ్గర పార్కులో కాసేపు కాలక్షేపం చేస్తే, కొంతదూరం ఇంటికి దగ్గరగా నడచినట్లు కూడా అవుతుంది'' అన్నాడు సూర్యం.

అర్చకుడన్న మాటలు మరచిపోవడానికి స్థలాంతరం ఉపకరిస్తుందని. సరోజిని ''సరే'' అని లేచింది. ఇద్దరూ పార్కులో ఒక సిమెంటు బెంచీమీద కూర్చున్నారు. సరోజినికి నవ్వువచ్చింది.

''ఎందుకు నవ్వుతున్నావు?''

''ఎవరయినా షికారుకు సాయంత్రంపూట వస్తారు. వీళ్లు ప్రొద్దునే వచ్చారేమా అని ఎవరయినా చూసి అనుకుంటారేమోనని నవ్వు వచ్చింది.''

''మనం షికారుకు వచ్చామని ఎవరూ అనుకోరు. పొరుగూరి బాటసారులు కూర్చున్నారని అనుకుంటారు.''

ఇంతట్లో ఒక పిల్లవాడిని తీసుకొని తల్లీ దండ్రులు వచ్చారు.

''జోగి అడుక్కుంటున్నాం ష్షాబాబూ! తిరుపతికొండకు పిల్లవాణ్ణి తీసుకువెడుతున్నాం. మీ దంపతులుకూడా చేతిమీదుగా ఏదో యివ్వాలి బాబూ!'' అని పళ్లెం పట్టాడు. సూర్యం తోచినది వేశాడు. వాళ్లు వెళ్ళిపోయారు.

''వీళ్లు అర్చకుడికంటె మంచివాళ్లు. అక్షతలు చేతో పుచ్చుకుని నెత్తిని వేయలేదు'' అన్నాడు.

సరోజిని చెక్కిళ్ళు జేవురించినై.

''బావా!'' అన్నది బిగ్గరగా, వారిస్తున్నట్లుగా.

సూర్యం వెంటనే మూతిమీద వేలు వేసుకున్నాడు. సరోజినికి నవ్వువచ్చింది.

''మూతిమీద వేలెందుకు?''

''ఈమధ్య ఒక స్కూలులో మూతిమీద వేలు వేయించి ఒక పంతులమ్మ పిల్లలందరినీ కూర్చో పెట్టడం చూశాను. వాళ్లకు పాపం నోరూ వాయి లేదు. అంతమంది వున్నా వున్నట్లుగానే కన్పించరు. ఎందుకలా చేయిస్తున్నారు? ఇదేమయినా వ్యాయామమా? అని ప్రక్కవాళ్లను అడిగాను. డిసిప్లిన్! మూతిమీద వేలు అనేది వుంటే, నోరు విప్పరాదనే విషయం పిల్లలకు జ్ఞాపకం చేస్తుంది అని చెప్పారు.''

''బావా! నువ్వు 'కిడ్'వా?''

''కాదు. మేకపిల్లయితే అరుస్తుంది. నేను

## మగదిక్కు

(23 వ పేజీ తరువాయి)

నెమ్మదిగా మాట్లాడుతున్నాను.''

''బావా! నేను మాట్లాడవద్దని అనలేదు. అల్లాంటి వేళాకోళాలు మాత్రం పనికిరావు.''

''అవును. వరుసవాళ్లతో పరియాచకాలాడ కూడదు. అందులో అల్లాంటివసలు ఆడకూడదు.''

సరోజిని చురుక్కున చూసింది. సూర్యం ఆమె వంక చూడడం మాని గడియారం చూసుకున్నాడు.

''ఈపాటికి పెళ్లికొడుకు గృహప్రవేశం చేసి వుంటాడా?'' అన్నాడు.

సరోజిని పకపకా నవ్వింది. సరోజిని స్వభావ సిద్ధంగా అందమైనది కాకపోయినా, నవ్వితే, అందకత్తెలనబడేవాళ్ల నవ్వును గోటమీట కలదనే విషయం ప్రథమంగా సూర్యాని కప్పుడు తెలిసింది.

''నువ్వు హాస్యప్రియుడవు బావా! నీ మాటలు యింత తీరుబడిగా ఎప్పుడూ వినలేదు.''

''ఏదో ఒక ప్రియుణ్ణికాని, గృహప్రవేశం చేసి వుంటాడా రామబ్రహ్మంగారు?''

''వడుగూ, పెళ్లీ, కార్యం, అయి, సంతాన వంతుడయిన ఆసామీకి పెళ్లికొడుకని పేరు పెట్టావుకదా! అక్కడ ఏమి జరిగివుంటుందో ఊహించి చెప్పగలవా?''

''చెబితే ఏమిటి ప్రయోజనం?''

''ఏమీలేదు. నువ్వు సరిగా ఊహ చేయగల వనుకుంటాను. అంతే!''

''ఇంతేకద! మెచ్చి మేకతోలు కప్పవుకద! పోనీ! ఊహించమంటావ్. సరే! ఒకరిని ఒకరు గుర్తుపట్టలేకపోవచ్చు. కొంతసేపయిన తర్వాత యిద్దరిలో ఒకరు గుర్తుపట్టి, తర్వాత రెండవవారు గుర్తుపట్టవచ్చు.''

''వచ్చు! వచ్చు! అయితే ఆడపిల్ల కాకపోతే మగపిల్లడు పుడతాడన్న జోస్యం మాదిరిగా వుంది.''

''మనం అల్లాగే చెప్పగలం కాని, శివార్చకుడు చెప్పినట్లుగా కచ్చితంగా పుత్రుడే అని ఆశీస్సు లిచ్చినట్లుగా చెప్పగలమా?''

''ఏయ్ బావా? శివార్చకుడివి ఆశీస్సులు. జోస్యం కాదు.''

''జోస్యమయినా, ఆశీస్సులయినా కచ్చితంగా జరుగుతుందని నువ్వు అనగలవా?''

''ఏయ్ బావా! ఇదిగో!'' అని క్రోటన్ రెమ్మ ఒకటి త్రుంచి జళిపించింది సరోజిని.

''సరోజినీ! నువ్వు అడిగింది జోస్యం లాంటిదే కాని చూసింది కాదుకదా! అసలు మనము చూస్తూ వుండగా వారేమీ మాట్లాడరుగా!''

సరోజిని చెక్కిళ్లు ఎఱ్ఱబడినై.

''అందుచేతనే వాళ్లకు ఏకాంతం కల్పించింది. కాని ఒక్కటి మాత్రం నిశ్చయం. నీవు అరగంటలో వస్తానని అక్కతో చెప్పేవచ్చావు కనుక, అక్కడ ఎన్ని అవకాశాలున్నా, నువ్వు అనుకున్నదేమీ జరుగక పోవచ్చు! అందులో పట్టపగలు కనుక, ఆయనకు పిలకకూడా వున్నది కనుక, అసలు జరుగదు!''

''బావా! అర్చకుడు ఆశీర్వదించిన దగ్గర నుంచీ నీ సంగతి కనిపెట్టి చూస్తున్నాను. నీ ఒళ్లు ఒళ్లుగా లేదు. ఒళ్లుమరచి మాట్లాడుతున్నావు. హుషారు ఎక్కువవుతోంది!''

''సరోజినీ! హుషారు ఎక్కువయేది నాకు కాదు. నేనేమీ ఏకాంతంలో వున్న ఆలిమగలమీద అధికాసక్తిని చూపించలేదు.''

''ఈపాటికి పెళ్లికొడుకు గృహప్రవేశం చేసి వుంటాడా అని ముందుగా అన్నది నువ్వే. తర్వాత నేనేదో అంటే దానికి వెక్కిరింతలు ప్రారంభించావు. మొత్తంమీద బావవనిపించావు!''

''ఇన్నాళ్లకు!''

''ఎన్నాళ్ళకయినా బావవే. బంధుత్వం ఎక్కడకు పోతుంది?''

''అదికాదు సరోజినీ! ఆయనేమో యిద్దరు భార్యలతో విడివిడిగా సంసారం చేసిన పురుషుడు. సురేఖ పురుషుణ్ణి ఎరుగనిదికాదు. ఆయనతో కొద్దికాలమయినా సంసారం చేసిన స్త్రీ, నీ పుణ్యమా! అని యిద్దరూ నా ప్రణాళికవల్ల ఏకాంతంలో బహుకాలానికి కలుస్తున్నారు. ఆ పుణ్యంలో చాలా భాగం నీది. కొద్ది భాగం నాది. చాలా భాగం అని ఎందుకంటున్నానంటే — సురేఖ నీకు స్నేహితురాలు. నువ్వు నాకు పది రూపాయ లిచ్చి ఆమె పనిమీద ఆయనకోసం పంపావు. వాళ్ళు సమావేశమయిన యిల్లు నీది. టిఫిను నీది, కాఫీ నీది.

నాదేమున్నది? కొద్ది వాక్సహాయం. జాబు వ్రాశాను కనుకనూ, ప్రయాణం అయి వెళ్లాను కనుకనూ శరీర సహాయం. మళ్ళీ అందులో జాబుకు సిరా ఖర్చు, కాగితం ఖర్చు, కవరు ఖర్చు, అన్నీ నీవే.

ఒకళ్ళ రుచి ఒకరు ఎరిగినవాళ్ల సంగతి, ఘోటక బ్రహ్మచారినైన నేను ఊహించగల నంటావా? అనాఘ్రాత పుష్పానివి నీ వూహించగల నంటావా?''

''బావా! ఇక అవు.'' అని దోసిలితో ముఖం కప్పుకుంది సరోజిని. ముఖంలో ప్రతి భాగంలోనూ సిగ్గు లాస్యం చేసింది.

''అరగంట కాలక్షేపం జరుగాలి కనుక, తోచక నేనేదో పిచ్చాపాటీ మాట్లాడితే, నువ్వు ఏదో ఏదో మాట్లాడుతావేమిటి, బావా! నిన్ను ప్రశ్న అడిగిన తప్పు నాదే. ఇక వెడదాం పద! చాలా టయమయింది.''

సూర్యం ముఖం చిన్నపుచ్చుకొని లేవకుండా కూర్చున్నాడు.

''నువ్వు చెప్పింది నిజం, సరోజినీ! ఏకాంతం బహు చెడ్డది. నేను మాట్లాడిన మాటలు వెనక్కితిరిగి చూసుకుంటే, నీదగ్గర నేనెక్కువ చొరవ తీసుకున్నానా అనిపిస్తోంది. ఇంతకుముందు, నీవన్నట్లు ఒళ్లు దగ్గర పెట్టుకుని జాగ్రత్తగా మాట్లాడేవాడిని. నా మనస్సు నా మనస్సుగా లేదు. నేను రాలేను. వచ్చినా వాళ్ళతో సరిగా మాట్లాడలేనేమో!''

''బావా! నువ్వు మేనత్తకొడుకువు. నీ తీరులో నీవు చమత్కారంగా ఏదో అన్నావు — నాతీరులో నేను ఏదో అన్నాను. మనుష్యులలో మాలిన్యం లేనంతవరకూ, వట్టి చమత్కారాలు బాధించవు. లే! 'ఆటలో అరటిపండు' అని పిల్లలనుకుంటారే — అల్లా సరిపెట్టుకుందాం.''

[ఇంకా వుంది]

మవాలీ





# విలువలు

చాణిక్యచంద్రగుప్త

"బొబ్బాబు మీకు పున్నెంవుంటుంది ఒక పైసా దరమం సెయ్యండయ్యా యెంతో దీనంగా వుందా గొంతు. వెనుతిరిగి చూశాను. అస్థిపంజరం లాంటి ఆకారం ... నడుం వంగిపోయిందేమో నిటారుగా నిలబడలేనట్టు కర్ర ఊతంతో నిలబడి వుంది...! అన్నంతిని ఎన్నిరోజు అయ్యిందో ఏమో పొట్ట లోపలికిపోయి వుంది.

పైసలు వేసేవారు వేస్తున్నారు. కొంతమంది ఆ మనిషిమీద జాలి కురిపిస్తున్నారు. ఎంతోమంది విసుక్కుంటున్నారు. అవునుమరి! జాలి అయితే చూపించగలరుగాని అతని గోల వినిపించుకునే వారెవరు? పైగా వాళ్ళున్న పరిస్థితిలో విసుగుదల కాకపోతే మరేం చూపించగలరు! అది అసలు కొత్త సినిమా విడుదలఅయినరోజు. ఆ హాలు ముందు అతను యెంతసేపట్నుంచి వున్నాడోయేమో గాని, నేను మాత్రం ఒక అరగంటనుంచి లైనులో నిలబడి టిక్కెట్టుకోసం యెదురుచూస్తూ వున్నాను. ఇంకా మ్యాట్నీ వదలలేదు. దానికి చిహ్నమేమో అన్నట్లు బుక్కింగ్సు ముందు పెద్ద పాముల్లా మెలికలు తిరుగుతూ వున్నారు జనం! "సోడా ... సోడా ... ఏమండీ సోడా కావాలా? .. వేరుశనక్కాయలు...వేరుశనక్కాయలూ..." ఇంకా ఏవేవో చిరుతిళ్ళు అమ్మేవాళ్ళు ... ఆ కొత్త సినిమా పై వ్యాఖ్యానాలూ ... ఆ ప్రదేశమంతా చాలా హడావుడిగా వుంది.

"బాబూ దరమపెబువులు. ఒక్కపైసా దరమంసేసి పున్నెంకట్టుకోండి." దీనంగా ఆ ఆకారం అడుగుతూనేవుంది.

"ఫో, ఫోరా! వెధవా! చెప్తుంటే నీక్కాదు!" ఆ గద్దింపు వినవచ్చినవైపు ఒకసారి తిరిగి చూశాను. టెరికాటన్ పాంటు ... టక్‌చేసి వున్న టెరికాటన్ షర్టు ... చేతికొక ఖరీదైన గడియారం ... కళ్ళకు నల్లని అద్దాలూ ... నల్లగా నిగనిగలాడుతూ ముట్టుకొంటే మాసిపోతాయన్నట్లున్న షూ ... ఆ సూటువాలా మనిషిని చూస్తుంటేనే చెప్పొచ్చు చాలా ఖరీదైనవాడని!

"అయ్యా! ఏదో మీలాంటోల్లు దయ సూపాల ... మేం బతకాల..."

"అరే! చెప్తుంటే నీక్కాదు. అవతలకు ఫో ... అయినా ఏదన్నా పని చేసుకు బతకాలిగాని ... యిదేమిటి..." విసుక్కుంటున్నా డతను.

"కట్టం సెయ్యగలిగితే మాకీ కరమమేం బాబూ! అది సెయ్యలేకేగందా!"

"చూడండి సార్! వాడి తల బిరుసు .. అడుక్కుతినేవాడి కెంత పొగరో! ..." అని తన పక్కనవున్న ఆయనతో అన్నాడు ఆ సూట్‌వాలా!

వాకుమాత్రం ఆ అడుక్కుతినే అతన్ని చూస్తుంటే జాలి వేసింది. ఆ సూటువాలామీద విపరీతమైన కోపం వచ్చింది. "అతను అడుక్కు తింటున్నంత మాత్రాన అతనిపై అధికారం చలాయించే హక్కు అతనికేముంది? ... ముసలి వాడు...కాయకష్టం చేయలేనివాడు...అడుక్కుంటు న్నాడు. అంతమాత్రాన అంత హీనంగా చూసే అధికార మేముంది? చేతనైతే సహాయంచెయ్యాలి... లేకుంటే పొమ్మనాలిగాని ..."

"అయ్యా" అన్న పిలుపుతో యీ లోకంలోకి వచ్చాను. ఎదురుగా ఆ ముసలతను...అప్రయత్నంగా నా చెయ్యి జేబులోకి వెళ్ళింది. చేతికొచ్చిందెంతో తెలిసేలోగానే నా చేతిలో డబ్బు అతని చేతిలో వుంచాను. అది చూసి అతని కళ్ళు మెరవడం గమనించాను. అపుడు నా కళ్ళు అతని చేతివైపుకి మళ్ళాయి. అతని చేతిలో ఒక రూపాయి కాగితం... అది చూసుకొని మురిసిపోతున్నాడతను. అతని కళ్ళు ఆనందంలో మెరిసిపోతున్నాయి. ఆ క్షణం నాకెంతో తృప్తి నిచ్చింది. బహుశా నా పాతికేళ్ళలో అటువంటి తృప్తిని యింతవరకు పొందలేదేమోనని పించింది.

"ఇటువంటివాళ్ళు వుండబట్టే అడుక్కునే వాళ్ళు ఎక్కువవుతున్నారు. పెద్ద మెహర్బానీగా నలుగురూ గొప్పగా తమను గురించే చెప్పుకోవాలనో, ఏమో ధర్మంచేసిపోతున్నారు." సూట్‌వాలా నాపై విసుక్కోవడం నాకు స్పష్టంగా వినిపిస్తోంది. నాకా క్షణంలో అడుక్కుతినేవాళ్ళను ప్రోత్సహించాననే ఆలోచనకంటే ఆ ముసలతని కళ్ళలో కనిపించిన మెరుపుదనం, అంతకుముందు దీనంగా వున్న అతని చూపు ... అంతా ఒక్కసారి నా కళ్ళముందు మెదిలింది.

ఇంతలో ఎప్పుడు మ్యాట్నీ వదిలారో ఏమో బుక్కింగ్సు తెరిచి టిక్కెట్లు యిస్తున్నారన్నట్లుగా గోల...ఈలలు...నెమ్మదిగా మా లైను ముందుకు కదులుతోంది. ముందుకు కదులుతున్నకొద్దీ నాకు టిక్కెట్టు దొరుకుతుందన్న ఆశ పెరుగుతోంది. బుక్కింగు వేపుకు నెమ్మది నెమ్మదిగా కదులుతున్నాం మేము ! ... ఇంతలో, నా వెనక ఎవరో అరుస్తున్నారు ... "అయ్యో నా పర్సు ! ... పర్సు !" అంటూ ! అంతే. అంతా ఒక్కసారి వెనక్కితిరిగి చూశాం ! ఆ సూట్‌వాలా ముందు నుంచొన్నతను అరుస్తున్నాడు పర్సు పోయిందంటూ ! అప్రయత్నంగా అక్కడ నుంచున్నవాళ్ళ చేతులన్నీ తమ తమ జేబుల్లోకి పోయాయి. తమ జేబులన్నీ భద్రంగా వున్నట్లు తృప్తిగా నిట్టూరుస్తున్నారు.

ఆ సూట్‌వాలా "ఆ దొంగవెధవ యిటే పరిగెత్తాడండీ ! నేను చూశాను. వాడు వెళ్ళిం తర్వాత తెలిసింది మీ జేబులో డబ్బు పోయిందని... లేకపోతే..." యింకా ఏమేమిటో మాట్లాడుతున్నాడు. అందరూ ఆ పెద్దమనిషిని ఓదారుస్తున్నారు. సానుభూతి చూపిస్తున్నారు ! ఆ గడబిడలో మా ముందున్న లైనంతా చెదిరిపోయింది. దాని స్థానంలో గుంపొకటి చేరింది. ఇక నాకా సినిమా అందదన్న ఆలోచనతో నెమ్మదిగా అక్కడిమంచి యివతలగా నుంచొన్నాను కాస్త రిలీఫ్‌గా వుంటుందని !

ఆ బుక్కింగుముందంతా గోలగోలగా వుంది. ఉన్నట్టుండి నా దృష్టి గుంపులో జేబు కొట్టేస్తున్న వాని చేతిమీద పడింది. అది చూసేసరికి నా కెక్కడలేని ధైర్యం వచ్చినట్లయింది. మెరుపులా వెళ్ళి ఆ చేతిని చటుక్కున పట్టుకొన్నాను. ఆ చేతిలో పర్సు ! ... అపుడు చూసుకొన్నాడో ఏమో బిక్కమొహంతో బయటికి వస్తున్నాడు పర్సు పోయినతను ! అంతలోనే నా కళ్ళు ఆ పర్సు దొంగ వేపు కెళ్ళాయి. అతన్ని చూస్తూనే నిర్ఘాంతపోయాను ! అతనెవరో కాదు ! ... ఆ "సూట్‌వాలయే !" పర్సు పోగొట్టుకొన్నతను మా ఇద్దర్నీ చూసి క్షణంలో పరిస్థితిని అర్థంచేసుకున్నాడేమో... పర్సు చూస్తూనే అతని కళ్ళు మెరిశాయి...అంతే ! సూట్‌వాలాను గుంపులోనుంచి బయటకు లాగాడు.

"చూడండి సార్ మీరంతా ! ... నాజేబులో పర్సు కొట్టేశాడు" అంటూ వివరిస్తున్నాడు పక్కనున్నవాళ్ళకు సూటువాలాను చూపిస్తూ.

"పర్సా ! ఛఛా ... అదిగో ఆ పెద్దమనిషి కొట్టేస్తూంటే పట్టుకొన్నాను..." ఇంకా ఏవేవో చెప్పుకొస్తున్నాడు సూట్‌వాలా, నన్ను చూపిస్తూ !

మ్రాన్పడిపోయాను ! క్షణంపాటు పరిస్థితి అర్థంకాలేదు. నా కళ్ళు తిరుగుతున్నట్లు అనిపించాయి ! ఏదో మొండిధైర్యంతో నిలదొక్కుకొని చుట్టూ కలయచూశాను.

అక్కడున్న జనం అంతా నాచుట్టూ మూగారు. నాకు క్షణంలో పరిస్థితి అర్థమయ్యింది. వాళ్ళంతా కల్సి నన్ను దొంగగా లెక్కకట్టి ఏం చేస్తారో ఊహించాను. అంతలోనే ఆ పర్సతను "దొంగవెధవా ! పర్సు కొట్టేసింది నీవైతే ఆయనమీద చెప్తావా ? సూటువాలాను గట్టిగా ఒక తన్ను తన్నాడు. ఆ తన్నుకి కిందపడ్డ సూటువాలాని చూస్తూంటే ఎందుకో బాధేసింది ! చటుక్కున సూట్‌వాలా మీద మరో దెబ్బపడకుండా అడ్డుగా నిల్చాను.

"మీరు తప్పుకోండి సార్ ! ఇలాంటివాళ్ళకి తన్నులు తగిలితేగాని బుద్ధిరాదు" అంటూ నామీద నుంచి సూటువాలాని కొట్టబోయాడు అతను.

"తొందరపడి అతన్ని కొట్టకండి ! కొట్టినంత మాత్రాన అతను దొంగతనం మానాడని ఎందుకు అనుకోవాలి. ఆలోచించండి !"

"ఆలోచించేదేమిటయ్యా ! కొట్టక..." అన్నారెవరో గుంపులోంచి.

"బుద్ధి చెపితే బాగుపడతాడని నమ్మకం ఏమిటి ? తన్నండి వెధవను ! కాళ్ళు చేతులు విరగ్గొట్టి అవతల పారెయ్యండి." అని కొన్ని కంఠాలు అరిచాయి.

"మీరు తొందరపడొద్దు ! ఏయ్ మిస్టర్ ! లేచి నిలబడు." అంటూ అతన్ని నుంచోబెట్టి, అందరివేపు తిరిగి "మీరంతా ఎందుకితని మీద చెయ్యి చేసుకోవడం ! ఇతన్ని శిక్షించడానికి పోలీసులు వున్నారు. వాళ్ళకు అప్పచెప్పండి."

"చూడు మిస్టర్ ! ఇందాక ముసలతనికి ఒక రూపాయి వేస్తే ముష్టిని ప్రోత్సహిస్తున్నట్లుగా ఉపన్యాసం యిచ్చావు. మరి నిన్ను ఇప్పుడు వీళ్ళనుంచి తప్పిస్తూంటే మాత్రం దొంగతనాన్ని ప్రోత్సహిస్తున్నా ననుకోకు ! చూడు మిస్టర్ ! చదువుకున్నవాడిలా వున్నావు. ఎందుకీ పనికి దిగావో యిప్పుడనవసరం. నీకన్నా యిందాక ఆ ముసలతని వృత్తిలో నిజాయితీ వుంది ... గొప్పతనం వుంది... అతను యిస్తే పుచ్చుకొంటాడు. ఇవ్వకపోతే కనీసం నొచ్చుకోనుకూడా నొచ్చుకోడు. అతని బతుకు కేవలం యితరుల మానవత్వంమీద ఆధారపడివుంది. మరి నువ్వు చేసేంది? నీలో వున్న నీచ ప్రవృత్తిపై ఆధారపడి వుంది ... జాగ్రత్త ! ఇంకెప్పుడూ ఇలా చెయ్యకు ... పని చేసుకో ... దొరికింది తిను ... పని దొరక్కపోతే అడుక్కుతిను. అదీ చేతకాకపోతే ... ఆపూట పస్తుండు ! అంతేగాని దొంగతనాలు మాత్రం చెయ్యకు ! నిలకడగా ... నిజాయితీగా బతుకు. ఇందాక ఆ ముసలతనికి చెప్పిన నీతులన్నీ ముందు నువ్వు నేర్చుకో" అంటూ కదిలాను వడివడిగా. అక్కడున్న వాళ్ళందరూ తలోరకంగా వ్యాఖ్యానాలు చేస్తూనేవున్నారు. అవన్నీ నాకేం పట్టనట్టుగానే ముందుకు నడిచాను మౌనంగా. కాని నా మనస్సుమాత్రం అతన్ని గురించి ఆలోచిస్తూనేవుంది.

'నన్ను ప్రేమించు'లో జగదీష్‌బాబు, శుభ







"ఇదెక్కడి న్యాయం?"

"భలే రాజా!"

* తారుమారు *

"దేవుడున్నాడు జాగ్రత్త!"

"స్నేహం"





పరిక్రొత్తగా వచ్చిన కెల్వినేటర్‌ను
డిఫ్రాస్ట్‌గా, డ్రయిన్‌గా చేయడానికి,
మీ ఒక్క చిటికెన వ్రేలు చాలు!





స్పెన్సర్స్ ఇప్పుడు ప్రత్యేకంగా
మీకొరకై ఆటోమేటిక్ డిఫ్రా
స్టింగ్, డ్రయినింగ్ నిచ్చే
పుష్‌బటన్ సిస్టమ్ గలిగిన
సరిక్రొత్త 286-లీటర్ మోడల్‌ను
అందజేస్తున్నారు.

ఈ క్రొత్త మోడల్ డిఫ్రాస్టింగ్ డ్రయినింగ్ విధానంలో పుష్‌బటన్ సిస్టమ్ కలిగివున్నది. థెర్మోస్టాట్ సెంటర్లోవున్న రెడ్ బటన్‌ను నొక్కండి. డిఫ్రాస్టింగ్ గిర్రున ప్రారంభమవుతుంది. అక్కడక్కడే అమరివున్న డ్రయినేజ్ సిస్టమ్, కరిగిన మంచునీటినంతా రిఫ్రిజరేటర్ అడుగుభాగంలోవున్న 'ట్రే' లోనికి తరిమివేస్తుంది.

ఇక, ఆ నీటినంతా — చాల ఎక్కువ వాతావరణ పరిస్థితుల్లో — మటుమాయం చేయునది, ఆవిరి పద్ధతి. అంతకీ కాకపోతే,— తీయడానికి అందుబాటుగా ఆ 'ట్రే' వున్నది గనుక, దానిలోని ఆ నీటిని మనమే ఖాళీ చేయవచ్చును. అన్నట్టు, డిఫ్రాస్టింగ్ పద్ధతి పూర్తికాగానే, రిఫ్రిజరేటర్ తిరిగి యథాప్రకారంగా తన డ్యూటీ తను చేస్తుంది.

డిఫ్రాస్ట్ చేయడం కోసమని, రిఫ్రిజరేటర్‌లోని ప్రతి వస్తువునూ బయటకు తీసిపెట్టే శ్రమా, బాధనుంచి,— ఇంటి ఇల్లాలును ఈ సరిక్రొత్త కెల్వినేటర్ ... 286 లీటర్ మోడల్ — కాపాడుతుంది. అంటే, దానికదే ఆటోమేటిక్‌గా ఆ పని చేసేస్తుంది. ఈ డిఫ్రాస్టింగ్ పద్ధతి జరుగుతూవున్నప్పుడుగూడా, ఫ్రిజ్‌లోనున్న పదార్థాల సంరక్షణకోసం — ఆఫ్రిజ్‌లో తగినంత శీతోష్ణపరిమాణాన్ని అలాగే ఉంచుతుంది.

ఇదే చిటికెనవ్రేలు చిరు రహస్యం,
డిఫ్రాస్టింగ్, డ్రయినింగ్ విషయంలో;
కెల్వినేటర్ విధానంలో!

నేడే చూడండి, ఈ సరిక్రొత్త మోడలును — మీకు దగ్గర్లోవున్న స్పెన్సర్స్ షోరూమ్‌లోగాని, డీలర్ వద్దగానీ.

# కెల్వినేటర్
# స్పెన్సర్స్ నుంచి

1865 నుంచి సేవాధర్మమే
మా జీవిత ధ్యేయం!

స్పెన్సర్స్ అండ్ కో లిమిటెడ్

153, మౌంట్‌రోడ్, మద్రాస్-600 002
19-ఎ. అలీపూర్ రోడ్, ఢిల్లీ - 110 054
స్పెన్సర్స్ బిల్డింగ్, పోర్జెట్‌స్ట్రీట్, బాంబే-400 036
70, డైమెండ్ హార్బర్ రోడ్, కిద్దర్‌పూర్, కలకత్తా-700 023.

SC.799 Tel.

# ప్రపంచ డైరీ

## హంతకురాలికి ఆశ్రయం

కుటుంబ కలహాలలో తన కుటుంబంలోని ఒకరిని హత్య చేసి యావజ్జీవ శిక్ష అనుభవిస్తున్న 31 ఏళ్ళ ఫిట్జ్‌పాట్రిక్ అనే ఆమెను అమెరికా ప్రెసిడెంటు కార్టర్ తన తొమ్మిదేళ్ళ పిల్లకి నర్సుగా నియమించారట. ఆయన, ఆయన భార్య కోరినందువల్ల ఆ ఫిట్జ్ పాట్రిక్ విడుదల చేయబడినదట.

## మేధస్సు విలువ !

ఇండియాలో డాక్టరు చదువు చదివి, పట్టం పుచ్చుకుని, అమెరికాకు పోయి అక్కడ స్థిరపడిన ఒక్కొక్క డాక్టరు వల్ల మన దేశానికి మూడు లక్షల ముప్పయి వేల రూపాయల నష్టమట. అమెరికాకు అతనివల్ల యాభై ఒక్క లక్షల రూపాయలు లాభమట. ఇదే ప్రకారం మనదేశం నుంచి అమెరికా వెళ్ళి స్థిరపడిన ప్రతిమేధావివల్ల మన దేశానికి లక్షా లొంభై రెండు వేల నష్టమని అమెరికాకు పద్దెనిమిది లక్షలు లాభమనీ మన దేశం అంచనాలు వేసింది. అనగా ఆ దేశంలో ఆ మనిషి మేధస్సుకు వేసిన లెక్క మన దేశంలో ఆమనిషి లేక పోవడం వల్ల ఎంత నష్టమని వేసే లెక్కలకన్నా చాలా తక్కువన్నమాట! దీన్నిబట్టి మన దేశంలోని విజ్ఞానులను మన దేశంకన్నా అమెరికా ఎక్కువగా ఉపయోగిస్తున్నదేమో అనిపించదూ!

## కసిగా మారిన ప్రేమ

జలకంఠాపురం అనే ఊరిలో నవుందప్పన్ అనే యువకుడు లీల అనే అమ్మాయిని ప్రేమించి ఆమె కూడా తనను తప్ప వేరెవర్నీ ప్రేమించటం లేదనుకున్నాడు. కాని లీల చాలా మందిని ప్రేమిం చగానే కాక, ఖుది కూడా మించిందని తెలిసి, ఇది నీకు తగదని చెప్పి చూస్తే ఆమె వినలేదు. దాంతో నవుందప్పన్ ఆగ్రహం తెచ్చి ఆమె ముఖం మీద పోశాడట. ఆమె ముఖమూ, వక్షస్థలమూనూ కాలిపోయాయట.

బాగు బాగు !

సిరియా దేశంలో ఒకరింటికొకరు ఏ విందుకైనా, పండుగకైనా వెళ్ళి, అలా వెళ్ళిన వాళ్ళింట్లో ఏ వస్తువునైనా చాలా బాగుంది చాలా బాగుందని పొగిడితే ఆ ఇంటివారు ఆ వస్తువును అలా పొగిడినవారికిచ్చేస్తారట. కానీ ఇల్లే బాగుందంటే! ఇంతే సంగతులు.

## విషాదాంతమైన రహస్య ప్రేమాయణం

కడలూరుకు చెందిన సన్యాసి అనే ఆయన 28 ఏళ్ళ కూతురు రాజేశ్వరి ఎం. బి. బి. ఎస్. చదివి పట్టా పుచ్చుకున్నదట. ఈమెకు అదే ఊరుకు చెందిన వివాహితుడు, యిద్దరు పిల్లల తండ్రి అయిన రామానుజం అనే ఆయనకు రహస్య ప్రేమాయణం ఆరంభమై అది పెళ్ళి చేసుకుని తీరాలనే పట్టుదలవరకూ ఎదిగిందట. దీనికి రాజేశ్వరి తలిదండ్రులు సుతరామూ ఒప్పనందువల్ల వారిద్దరూ గుట్టు చప్పుడు కాకుండా మద్రాసు వెళ్ళి, రాయపేటలోని ఓ హొటలులో రూము తీసుకుని ఒకరికొకరు వొదార్చుకుని, బ్రతికి కలిసుండలేనప్పుడు చచ్చి కలుసుకునుండాలని తీర్మానించుకుని నిద్ర మాత్రలు పొడిగా నూరి పాలలో కలుపుకుని చెరి సగం త్రాగేశారట. వేసిన తలుపు లెంతకూతీయక పోయేసరికీ విషయం హొటలు వారు పోలీసువారికి చెప్తే వారొచ్చి తలుపులు పగలేసి, వారిద్దర్నీ ఆసుపత్రిలో చేరిస్తే రాజేశ్వరి చనిపోయిందట.రామానుజం మాత్రం కోలుకుంటున్నాడట—

## రష్యాలో అమెరికన్ నవలలకు గిరాకీ !

రష్యా దేశంలో అమెరికా నవలలు చదివేవారు చాలా ఎక్కువై పోయి, తత్ఫలితంగా అమెరికా నుంచి యీ నవలల దిగుమతి పెరిగిపోయిందట దాంతో రష్యా ప్రభుత్వం యీ పుస్తకాల దిగుమతిని నిషేధించిందట. ఆ నిషేధంతో గిరాకీ యింకా ఎక్కువై యిప్పుడు ఆ నవలలు నల్లబజారులో వెర్రిగా అమ్ముడుపోతున్నాయట. ఎర్నిస్ట్ హెమింగ్వే నవల చిరిగిపోయినదైనా రెండొందల రూపాయలకు (మనడబ్బు లెక్క) వెర్రిగా కొనుక్కుంటున్నారట— అయ్యయ్యో! హువ్వయ్ విష్కు కారీ అవర్ హెమింగ్వే స్టూ రష్యా-బోల్షు డబ్బోచ్!




## కాల్షీట్‌కు 20 లక్షలు !

హాలీవుడ్ ప్రఖ్యాత నటుడు మార్లిన్‌బ్రాండో ఒక్క కాల్షీటుకు ఒక లక్షా ఎనభై వేల అయిదు వందల పౌనులు తీసుకుంటారట. అనగా మనదేశపు డబ్బులో ఇరవై లక్షలన్నమాట. ఇటువంటివి ఓ సినిమాలో సుమారు ఓ డజనుకు పైగా వుండవూ? (కాల్షీట్ల లెక్క) అంటే ఆయన ఓ సినిమాకు తీసుకునేదెంత !?

## న్యూయార్క్‌లో 'బొంబే సినిమా'హాలు !

న్యూయార్క్‌లో లింకన్ ఆర్ట్స్ థియేటర్ అనే ఓ సినిమా హాలును ఓ యిద్దరు భారతీయులు కొని, దాని పేరు బొంబే సినిమాగా మార్చి, అందులో కేవలం హిందీ సినిమాలు రెగ్యులర్‌గా ప్రదర్శిస్తున్నారట. అంతవరకూబానే వుంది కానీ హువ్వెబవుటిన్కూవ్?

## ...పార్టీ గెలిసే ఆదాయపుపన్ను రద్దు !

మాల్డా దీవిలోని ఎన్నికల ప్రచారంలో ప్రత్యర్థి పార్టీ ప్రముఖుడు తన పార్టీ పదవిలోకి వస్తే దేశంలో ఎవ్వరూ ఆదాయప్పన్ను కట్టనవసరం లేనట్టు తానా పన్నును రద్దు చేస్తానని ప్రచారం చేస్తున్నారట. చైనీండి.

## సౌదీలో పనివారి కొరత !

సౌదీఅరేబియాలో పంచవర్ష ప్రణాళిక వేసి, ఆ ప్రణాళిక అనుకున్నదనుకున్నట్టు అమలుపరచాలంటే తమ దేశానిక్కనీసం యాభై లక్షలమంది పనివారిని దిగుమతి చేసుకోవాలని ప్రకటించిందట.

## అన్ని మందు లెందుకు ?

భారతప్రభుత్వం నియమించిన హాతీ కమిటీ నివేదిక ప్రకారం మనదేశంలో తయారవుతున్న 15 వేల మందులలో అవసరాలకాదుకునే మందులు 116 మాత్రమేనట అంటే !! మిగతావి పరదాకి వేసుకొనేవా, లేక అవసరం లేనప్పుడు వాడాల్సినవా!! ఏమో!! కమిటీ నివేదనది.

## భార్యని దారుణంగా సజీవదహనం చేసిన భర్త !

కోళికోడు అనే ఊరిలో రామన్ అనే అతను తన భార్య 28 ఏళ్ల నారాయణి మీద అర్ధరాత్రి కిరసనాయిలు పోసి, నిప్పంటించాడట. బాబోయ్, నాయనోయ్ అనే కేకలకు చుట్టుప్రక్కల ఇళ్ళ వాళ్ళు లేచొచ్చి చూస్తే రామన్ గుమ్మానికి అడ్డంగా నించుని, ఎవర్నీ లోపలకు వెళ్ళకుండా కర్రతో అడ్డుపెట్టేడట. కాస్సేపటికి నారాయణి చనిపోగానే అతను పారిపోయాడట. ఆ గదిలో మూడేళ్ళ కొడుకు ఆ వేడికి మగ్గి, ఓ మూలపడి ఉన్నాడట. రామన్ ఇంత ఘోరానికి తలపెట్టాల్సిన కారణం పోలీసులు వెతుకుతున్నారట. ఇంకేముంటుంది. అనుమానం పెనుభూతం అనినే అన్నారుకదా !

# సంఘప్రారంభం

## కవనశర్మ



### 4 సంపదలనాశించి చలనచిత్ర నటాగ్రేసరుని సన్మానించుట

**కొ**న్నాళ్ళ! కమిటీ మీటింగ్ అయింది. లెక్కా జమా వేసుకొన్నారు వసూలైన డబ్బులో ఎనిమిది వేలు మిగిలింది. దాన్ని భవననిర్మాణం కోసం విడిగా ఫిక్సెడ్‌డిపాజిట్‌లో వెయ్యాలని నిర్ణయించుకొన్నారు.

"నేను ప్రభుత్వాన్ని ఒకచిన్న స్థలంకోసం అడుగుతాను. దానికి నాతోపాటు కొంతమంది పెద్దలని కూడా తీసుకువెళ్తాను" అన్నాడు రామనాధం.

"నేను నాకు చేతనైన సహాయం చేస్తాను' అన్నాడు సుబ్బారావు.

"నేను వస్తాను" అంది పద్మావతీదేవి.

"మనం తెలుగు సమితి భవన నిర్మాణం కోసం జాగా సంపాదించే ప్రయత్నంతోపాటు భవన నిర్మాణం నిధి పోగు చెయ్యాలి. మొదట దానికి రామనాధంగారు, నేను, పద్మావతిదేవి గారు ప్రయత్నిస్తాం. రెండో దానికోసం యువకులైన రెడ్డి, వెంగన్నారావు,రంగారావు గార్లు ప్రయత్నించాలి" అన్నాడు సుబ్బారావు

వెంగన్నారావు వెంటనే అంగీకరించాడు.

"మావల్లనేం అవుతుంది!" అన్నాడు రంగారావు.

"మీరే ఏదైనా ఉపాయం చూడండి" అన్నాడు రెడ్డి.

"ఒక పని చేద్దాం. మన సినిమా యాక్టర్లలో ఒక పెద్ద నటుడికి సన్మానం చేద్దాం. ఆయనే తల్చుకుంటే మొత్తం బిల్డింగ్‌కి కావాల్సిన డబ్బు ఇచ్చేస్తాడు. వాళ్ళు తల్చుకొన్న సందర్భాలు కొన్ని వున్నాయి" అన్నాడు సుబ్బారావు.

"అల్లాగే చేద్దాం కాని నటుడు మన విషయంలో తలుచుకోకపోతే?" వెంగన్నారావు సందేహం వెలిబుచ్చాడు.

"సినిమా వాళ్ళ ప్రచారాల్లో ఏది నిజమో ఏది అబద్ధమో తెలియదు. కొన్ని కొన్ని చోట్ల అభిమాన సంఘాలే డబ్బులు పోగేసి వాళ్ళ అభిమాన నటుడి పేర విరాళాలిచ్చాయని కొంద రంటారు. అభిమానులు తమ సినిమాలు చూడటానికి గాను నటులే డబ్బిస్తారని మరి కొంద రంటారు. ఇలాటి వార్తల్లో ఏది నిజమో తెలియదు. ఇది కుక్కతోక పట్టుకొని గోదావరీదే ప్రయత్నం కారాదు" అన్నాడు రంగారావు.

"మనం పిల్చిన నటుడు మనకి విరాళం ఇవ్వకపోగా మనకి ఆయనమీద అధికంగా ఖర్చు (చెయ్యాల్సి) రావచ్చును. అంత పెద్ద నటుడు విమానంలో గాని రాడు. పైగా ఇక్కడ ఏ నక్షత్రాల హోటల్లోనో దింపాలి. ఎంతఖర్చు!" అని రామనాధం కొంచెం భయపడ్తుంటే.

"పోనీ మా యింట్లో దింపుకొంటాను" అంది పద్మావతీదేవి.

"అందరి సందేహాలు విన్నాను. నటుడిని పిలిస్తే అయ్యేఖర్చుకు నేను తెలుగు సమితికి ఈరోజున ఉన్న ఎనిమిదివేలలోంచి ఖర్చు పెట్టను. నేనే సంపాదిస్తాను. ఆయనిచ్చే విరాళాన్ని ఒక్క పైసా తగ్గకుండా భవననిర్మాణ నిధికిచ్చేస్తాను. సరేనా?" అని సుబ్బారావు అడిగాడు.

దాంట్లో ఆక్షేపణీయంగా ఏమీ లేకపోవడంతో అందరు ఒప్పుకొన్నారు—ఆరోజునే నాటక పోటీలు జరిపించి ఆ పెద్ద నటుడి చేత బహుమతీ ప్రదానం చేయించాలని కూడా అనుకొన్నారు. ఆ రోజున టికెట్లు పెడితే వేడి వేడి పకోడీల్లా అమ్ముడుపోతాయని, కొంతమంది నాటకాలకోసం, మరి కొంతమంది నటుడి కోసం, టికెట్లు

# ఆంధ్రజ్యోతి వెలిగించే మహా ఆనందజ్యోతి

అందరినీ అలరించే సినీ వార పత్రిక

దినపత్రిక సైజులో 10 పేజీలు, వెల 75 పైసలు

ప్రారంభ సంచిక [illegible] పేజీలు, వెల 75 పైసలు

# జ్యోతిచిత్ర

## తొలి సంచిక విడుదల

## 25-2-77

ఎన్నో నూతన శీర్షికలతో పాటు, ప్రత్యేక ఆకర్షణగా వారం వారం

పాఠకుల ప్రశ్నలకు **శ్రీ రావుగోపాలరావు** సమాధానాలు

ఉత్తమ ప్రశ్నకు 25 రూపాయల బహుమతి పొందే అవకాశం మీది

ప్రశ్నలు పంపవలసిన చిరునామా: "క్వశ్చను పాయింటు శీర్షిక"
ఎడిటర్ జ్యోతిచిత్ర ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, విజయవాడ-10

వివరాలకు: బిజినెస్ మేనేజరు
"ఆంధ్రజ్యోతి" విజయవాడ-10

కొనుక్కొని వస్తారని సుబ్బారావు హామీ ఇచ్చాడు.

రెడ్డి, వెంగన్నారావు ఓ ఆదివారం సుబ్బారావు ఇంటికి వెళ్ళారు. సుబ్బారావారోజు వాళ్ళని కొంతమంది పెద్దవాళ్ళ యిళ్ళకి తీసుకు వెళ్ళాలన్నాడు. వాళ్ళు పెద్దవాళ్ళేకాక తెలుగువాళ్ళుకూడా అయినవాళ్ళు అనిచెప్పాడు. సుబ్బారావు వాళ్ళని తనకార్లో ఎక్కించుకొని ముందరగా పెట్రోలు బంకుకువెళ్ళి పెట్రోలు పోయించి బిల్లు కార్యదర్శి తెలుగు సమితి పేరు మీద తీసుకొన్నాడు. "మనం టైమూ శక్తి ఖర్చు పెడుతున్నాం. చాలు డబ్బుకూడా ఎక్కడ ఖర్చు పెట్టగలం! వేర్ అండ్ టేర్, నేను సంఘంపనులు నెత్తిమీద వేసుకొన్నందుకు గాను నాకారు కెలాగో తప్పవ్!" అని నవ్వి కారుబయల్దేర దీసాడు

"మీరన్నది సబబే!" అన్నాడు రెడ్డినవ్వు కలుపుతూ

"ఇలా అయితే రామనాథంగారికి సమితి ఓ రెండొందలైనా ఇప్పటి దాకా బాకీ పడి ఉంటుంది" అనుకొన్నాడు రంగారావు

## సంఘ:పురాణం

"రామనాథం ఇల్లా బిల్లు సమితి పేరుమీద తీసుకోలేదు. ఇద్దరికీ ఏంతతేడావో" అనుకొన్నాడు వెంగన్నారావు

ఆ రోజు సుబ్బారావు అయిదారు మందిని జీవిత సభ్యులుగా జేర్పించాడు. అల్లా నాలుగు వారాలు తిరిగే సరికి పాతిక మంది సభ్యులు జేరారు. ఖర్చులు పోను రెండు వేల నాలుగు వందలు మిగిలాయి.

"అందులో కొంత ఖర్చుపెట్టి ఓ నాటకం వేద్దాం" అన్నాడు రంగారావు

"తప్పమ్మా! రంగారావు. ఇది నాటక పోటీలు పెట్టడానికి నటుడికి సన్మానం చెయ్యడానికీను. ఇప్పుడప్పుడే ఉగాది వచ్చే సిందా మళ్ళీ సంక్రాంతికి నాటక పోటీలు. ఇప్పటి నుంచి మంచి నాటకం ఒకటి ప్రాక్టీస్ చెయ్యండి మీరంతా. అప్పుడుపోటీలో నెగ్గి ఆ మహా నటుడి చేతుల మీదుగా ట్రాఫీలు పుచ్చుకొందురుగాని, ఏం!" అన్నాడు సుబ్బారావు.

"మళీ సంక్రాంతి దాకా మన కార్యక్రమాలు ఏమీ ఉండవా?" రంగారావు ఆశ్చర్యంగా అడిగాడు.

"మనం ఈ రాష్ట్ర ప్రభుత్వాన్ని సైటు కోసం అడగవచ్చు. సినిమా వేసి డబ్బు సంపాదించవచ్చు" సుబ్బారావు సమాధానం యిచ్చాడు.

"మొన్న సంక్రాంతికి టికెట్లు పెట్టాం. రేపు సంక్రాంతికి టికెట్లు పెట్టబోతున్నాం. పైగా మధ్యలో సినిమా వేసి టికెట్లమ్మితే సభ్యు లేమనుకుంటారో అని భయంగా వుంది" అన్నాడు రంగారావు.

"ప్రతీదానికి టికెట్లు పెడ్తే సభ్యత్వం కట్టాల్సిన అవసరం లేకుండానే టికెట్లు కొనుక్కొని రావచ్చుకదా ఇంక సభ్యులుగా ఎవరు జేర్తారు?" అన్న సందేహం వెలిబుచ్చాడు వెంగన్నారావు.

"అల్లా అయితే టికెట్టు మీద మెంబర్‌కి అర్ధరూపాయి తగ్గిద్దాం. నలుగురున్న కుటుంబానికి రెండురూపాయలాదా అవుతుంది. పైగా సినిమాయే ఒక ఎంటర్ టెయిన్

మెంట్. అదివెయ్యటమే ఒక కల్చరల్ ప్రోగామ్'' అన్నాడు రెడ్డి.

మొదటి సినిమా వేసారు జోరుగా టికెట్లమ్మారు ఖర్చులు పోను నాలుగు వందలు లాభం వచ్చింది. దాంతో మరో సినిమా వెయ్యాలని సంకల్పించారు. ఉత్తినే ప్రింటిచ్చిన డిస్ట్రిబ్యూటర్ చివరినిముషంలో మూడువందలిస్తేగాని ఇవ్వనన్నాడు. అసలు మళీ మాటాడితే తన దగ్గర ప్రింటేలేదు పొమ్మన్నాడు. అప్పటికే పబ్లిసిటీ విపరీతంగా ఇచ్చారు. మొదటి సినిమాకి ఏ పబ్లిసిటీ లేకుండానే నాలుగు వందలు లాభంవస్తే ఇంతపబ్లిసిటీకి ఒక వెయ్యన్నా రావాలన్న ధోరణిలో ఉన్నప్పుడు సరిగ్గా డిస్ట్రిబ్యూటర్ అలా మొండికి వేసాడు. చేసేదేంలేక అడిగినంత అతగాడి చేతిలో పెట్టారు. రెండో సినిమా ఆడాక లెక్కలు చూసుకుంటే, పబ్లిసిటీ ఖర్చులు పెరగటంవల్ల రెండువందలు నష్టం తేలింది.

నవంబరు నెలలో నాటకాల పోటీ గురించిన నిబంధనలు నియమాలు తయారయ్యాయి. స్థానిక వార్తాపత్రికలలో ప్రకటనలు వెళ్ళాయి. రంగారావు వాళ్ళు వెయ్యదల్చుకొన్న నాటకంతో చేరి మొత్తం నాలుగు నాటికలు పోటీకి వచ్చాయి.

ఇక్కడ జనం నాటకం ఎడాపెడా ప్రాక్టీస్ చేస్తుంటే అక్కడ సుబ్బారావు మెడాసుకి ట్రంక్‌కాల్స్ కొట్టేస్తున్నాడు. ''మీరుతప్పకుండా రావాలి'' ''మర్చిపోరాదు'' ''మేం ఆహ్వానాలు అచ్చువేయించేసాం''. పైగా తనకు మెడాసులో పరిచయం ఉన్నవాళకి ఫోన్‌చేసి స్వవిషయాలన్నీ తీరుబడిగా మాట్లాడుకుని ఆపైన ''మీరు కూడా అగ్రనటుడు మా ఊరు వచ్చేవిషయంలో ఏమార్పు రాకుండా చూడండి'' అంటూ కోరి ఆ బిల్లుల్ని కూడా తెలుగు సమితికి జమకట్టాడు. ఊళ్ళో ''ఆంధ్రుల అభిమాన అగ్రనటుడు వస్తున్నాడు. వివరాలకి తెలుగు సమితి కార్యవర్గ సభ్యులెవర్నైనా సరే అడిగితెలుసుకోండి'' అంటూ పబ్లిసిటీ ఇచ్చేస్తున్నాడు.

ఇంతలో సంక్రాంతి వచ్చేసింది. ఇళ్ళ ముందు ముగ్గులు వచ్చేసాయి. ఇంటి ఆడపడుచు బుగ్గల్లోకి ఎరుపులు కళ్లల్లోకి మెరుపులు వచ్చాయి ఇంటల్లుళ్ళు, ఇండియాకి పూర్వం రోజుల్లో వైస్రాయి వచ్చినంత ఠీవిగా వచ్చారు.




టౌన్ హాలు ఆరాతి దీపాలతో వెలిగిపోయింది ఎక్కడిలేని జనం వచ్చారు. ఈదెబ్బతో తెలుగు సమితి ప్రతిష్ఠ పెరిగిపోయిందన్నాడు సుబ్బారావు

పద్మావతీదేవి అగ్రనటుడిని తీసుకురావటానికి రామనాథం కారు వేసుకొని వెళ్ళింది. సుబ్బారావు అందర్నీ హడావిడి పెట్టేసి తను పడిపోతున్నాడు హోటలుకి ఫోన్ చేస్తే అగ్రనటుడు మేకప్ అవుతున్నాడని ఒక గంట ఆలస్యం వుందని 'నాటకాలు మొదలు పెట్టమన్నారు'' అనీ కబురు వచ్చింది.

''మొదలెట్టేయండి అందరూ రెడీగా వున్నారు కదా! నటుడుగారు వచ్చాక స్టేజి మీదకు తీసుకువస్తాం దండలు వేసేవాళ్ళందరు రెడీయే కదా! ఫొటోగ్రాఫర్ ఏడీ? అతన్ని ఫొటోలు తియ్యమని చెప్పాను. నేనే చెప్పాను. కమిటీతో చెప్పలేదంటారా. ఫరవాలేదు కమిటీ ఒప్పుకోకపోతే ఖర్చు నేనే పెట్టుకొంటాను చెట్టంత నటుడు వస్తే, మనం రెండొందల ఖర్చుకు వెనుతీస్తామా! పరువు నష్టం! అల్లాంటి దరిద్రపు బుద్ధులు మంచివి కావు. ప్రెస్సువాళ్లేరయ్యా... వాళ్ళకి సైట్‌నింగ్ అంతా రిజర్వు చెయ్యమన్నారు'' అంటూ హడావిడి పడుతూ కార్యక్రమానికి తొందర చేసాడు.

రామనాథం నాటకం ఒక కష్టసాధ్యమైన కళఅని అందులో పోటీలకి నాటకాలు వెయ్యడం ఇంకా కష్టమని నటులందరు నెలలతరబడి రిహార్సల్స్ వేసుకొని తయారయి వచ్చారని, ఈరోజున బహుమతి ప్రదానం చేసే ఆయన కళా తపస్వి అని తన కింకా ఆలస్యం చెయ్యడం ఇష్టం లేదని నాటకాలు మొదలుపెడుతున్నాం అని న్యాయనిర్ణేతలు వచ్చేసారని చెప్పాడు.

అయితే నాటికల పోటీ దగ్గరపడుతుందరు అగ్రనటుడు వచ్చాక ఆయన్ని తమ నటనతో ముగ్ధుణ్ని చెయ్యాలన్న కోరికతో ఆయన వచ్చాకే వేస్తాం అన్నారు న్యాయనిర్ణేతలు అది కుదరదని చెప్పి ముందు లాటరీ వేసి నిర్ణయించిన ప్రకారం నాటికలు మొదలు పెట్టాలని అన్నారు.

నాటికలు మొదలు పెట్టారు. ప్రేక్షకుల్లో రెండు రకాల వారున్నారు. మొదటివారు కేవలం అగ్రనటుణ్ని కనులారా చూసి జన్మధన్యం చేసుకొందామనుకొన్నవారు వాళ్ళు ఏమాత్రం అలికిడయినా ''వచ్చేసాడు'' అంటూ అటు కేసి తలలు తిప్పి చూడటం కనపడకపోతే నిలబడి. నిరాశపొంది కూర్చోటం చెయ్యడం మొదలెట్టారు. ప్రేక్షకుల్లో రెండో వర్గంవారు నాటిక పోటీ చూద్దామనే ఉద్దేశంతో గౌరవంతో వచ్చినవాళ్ళు వాళ్ళు ఈ సంచలనాలకి విసుక్కోవడం మొదలు పెట్టారు.

ఎల్లాగైతేనేం మూడో నాటిక అవుతుండగా అగ్రనటుడు వచ్చాడు. అప్పుడు సరిగ్గా స్టేజిమీద, ''ధైర్యం వుంటే కాల్చు ఈ అన్యాయాన్ని నేను సహించను'' అంటున్నాడు తుపాకి గురిపెట్టిన రెడ్డితో రంగారావు. అగ్రనటుడు ఎప్పుడైతే వచ్చాడో ప్రేక్షకులలో నూటికి తొంభై మంది లేచి నిలబడి వెనక్కి తిరిగి ప్రవేశ ద్వారం వేపు కుతూహలంగా చూడటం మొదలు పెట్టారు ''మా అభిమాన నటుడు వెంటనే వేదికమీదకి రావాలి'' అంటూ గొడవ మొదలు పెట్టారు.

''దయచేసి కూర్చోండి. ఈయన్ని ఇప్పుడే వేదిక మీదకి తీసుకువస్తాం'' అంటూ సుబ్బారావు జనాన్ని గట్టిగా కసురుతూ సర్దటం మొదలు పెట్టాడు.

అభిమాన నటుణ్ని వేదిక మీదకి తీసుకువచ్చే భారం రామనాథానికి అప్పచెప్పి, సుబ్బారావు వేదిక మీదకి ఎక్కి తెర వేయించేసాడు. రెడీగా పెట్టుకున్న బల్ల కుర్చీలు పూల కుండీలు తెర ముందర వేయించి లైట్లు ఎడ్జస్టు చేయించాడు.

వేదిక మీద పద్మావతీదేవి కూతురు ఆంధ్రుల అభిమాన నటుడికి హారతిచ్చింది. దానికా పెద్దనటుడు మిగుల సంతోసించి ''ఆడపడుచుల హారతి[illegible], అన్నయ్యల ఆ[illegible] సభ్యులో డబ్బు వేయటం తెలుగు వారి ఆచారం ఈ చలెమ్మ పొంగి[illegible] [illegible]
ఈ సమితికి [illegible]



"ఆ పద్మనాభంని పెళ్ళిచేసుకోనంటా వేమిటి ? అతనికేం తక్కువ! పైగా అతనికి వారసులెవ్వరూ లేని ఓ జమీందారి బాబాయి కూడా ఉన్నాడుట...

"అదేనే ..ఆబాబాయినే పెళ్ళి చేసుకుంటే ఎలాగుంటుందో అని ఆలోచిస్తున్నా !!

---

చదివిస్తున్నాను" అన్నాడు. సభంతా చప్పట్లతో దద్దరిల్లి పోయింది.

అగ్రనటుడిని కుర్చీలో కూర్చోబెట్టి సుబ్బారావు సన్మానపత్రం చదివాడు. అగ్రనటుడిని వెయ్యినారికేళ్ళతో పొగిడాడు. "పొగిడేవాళ్లకి పొగడబడ్డవాళ్లు తృణమో ఫణమో ముట్టచెప్పటం మన అలవాటు. అందుకని ఈ సందర్భంగా ఈ సంవత్సరం నాటక పోటీకు గాను కొన్న మొత్తం బహుమానాలకైన ఖర్చు నేనే భరిస్తాను" అన్నాడు అగ్రనటుడు. ప్రేక్షకులు అయిదు నిముషాలపాటు ఆగకుండా చప్పట్లు కొట్టారు.

ఆ పైన పద్మావతిదేవి దండ తీసుకొని వచ్చింది. అగ్రనటుడు మెడ వంచబోతుండగా అతని సెక్రటరీ అలాంటి వెధవపనిచేసి పబ్లిక్ ఇమేజ్ పాడ్చేసుకోవద్దు అన్నట్టుగా వారించాడు.

అది. కుచేలుడు తెచ్చిన అటుకులను రెండు గుప్పిళ్ళు ఆరగించి మూడోగుప్పిడి తీసుకోబోతున్న కృష్ణుడిని రుక్మిణీదేవి వారించినట్టుగా జనం అనుకొన్నారు. ఆదండ వేయించుకొని ఉంటే మీ భవననిర్మాణానికి గాను ఏపాతికవేలో ఇస్తున్నాను అనేవాడేమో అనుకొని వేయించుకోనందుకు నిరాశపడ్డారు. అగ్రనటుడు పద్మావతీదేవిచేతిలో దండఅందు కొని ఉపన్యాసం మొదలుపెట్టాడు. "మీ ఆదరాభిమానాలకి నాకృతజ్ఞత. నేను మీకిచ్చిన మొత్తం అతిస్వల్పం. దానికే మీరు చాలా సంతోషం వెలిబుచ్చారు. నిజానికిమీరు నానుంచి ఇంకా ఎక్కువ మొత్తమే ఆశించి ఉండవచ్చు. అయితే నాలాంటి ప్రముఖ నటుడికి రోజూ సన్మానాలు జరుగుతూ ఉంటాయి. ప్రతిచోట శక్తికిమించి ఇస్తూపోతే మేము దివాళాతీస్తాం. అయితే మాకు మాఅభిమానులతో మాసంపద పంచుకోవాలన్న కోర్కె చాలా బలంగా ఉంటుంది. ఈ సంపద మా అభిమానులనుంచి మాకు వచ్చిందే. అందుకని నేను ఎక్కడకు వెళ్ళినా ఏదో కొంత ఇస్తూ ఉంటాను. ఇప్పుడు ఇక్కడ మొత్తం ఎనిమిది వందలిచ్చాను. నేను నేనంత మొత్తం ఇచ్చానని చెప్పటం కాదుకాని నాకలా ఇవ్వటం అలవాటు. అది కళా సరస్వతి పాదపూజగా భావిస్తాను.

ఈ రోజు ఖర్చుపెట్టినది, మీ అభిమానం ఉంటే తిరిగి సంపాదిస్తాను. మీ అభిమానం ఉన్నంతవరకు నటిస్తూనే ఉంటాను. సంపాదిస్తూనే ఉంటాను ఇప్పటి హీరోయిన్ల మనవరాళ్లతో హీరోగా వేసే రోజు కోసం నాతోపాటు మీరూ ఎదురుచూస్తారని నాకు తెలుసు. సెలవు" అంటూ ముగించాడు.

జనం ఆపకుండా చప్పట్లు కొట్టారు. ఫొటోగ్రాఫరు అన్ని కోణాల్లోను ఫొటోలు తీసాడు. ఫ్లాషుల వెలుగులో మురిసిపోయాడు. అగ్రనటుడు వేదికదిగి ముందు వరసలో కూర్చున్నాడు. "రెడీగా ఉండండి" అంటూ లోపలికి ఓ కేకపెట్టి సుబ్బారావు తెర లాగించాడు. రొమ్ము ముందుకి జాచి చేతులు వెనక్కి పెట్టుకొని నిలబడిఉన్న రంగారావు మీద రెడ్డి ధామ్మని పిస్తోలు కాల్చాడు.

న్యాయనిర్ణేతలు రంగారావుని ఉత్తమ నటుడిగా నిర్ణయించారు. కాని రంగారావు మనస్సు వెలితితో నిండిపోయింది. సినిమా నటుడు ఆకట్టుకున్నట్టుగా జనాన్ని తన నాటకం ఆకట్టుకోక లేకపోయిందనీ అంత మంది జనం వచ్చారంటే అది సమితి గొప్ప దనంవల్ల కాక నటుడి పట్ల గల గ్లామర్ వల్లనని అతని మనసు మూల్గింది.

ఆ రాత్రి అగ్రనటుడికి కార్యవర్గం డిన్నరిచ్చింది మందు మంచినీళ్లలా ఖర్చయింది. దానికి పదిమందికి అయిదు వందలైంది. అతని మిగతా ఖర్చులు వెయ్యి అయ్యాయి. గోదావరి మేతకు లంక ఈతకు చెల్లయింది.

(ఈసారి యింకో కథ)

# ప్రపంచము యొక్క ప్రప్రథమ డెటర్జెంట్ ఉతికే బార్

# సూపర్ 777

హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో






సూపర్ 777 ఉతుకు ప్రపంచములో సరిక్రొత్తది! ఇది క్రొత్త ఫార్ములా. దీనికి ఎక్కువ బట్టలను ఎక్కువ తెల్లగా, ఎక్కువ శీఘ్రముగా ఉతికే సామర్థ్యము ఉన్నది—ఉప్పు నీళ్లలో కూడ! దీని ధర మామూలు బార్ సబ్బుల కంటె తక్కువ కూడ!

ఈ క్రొత్త రకపు ఉతికే బార్‌ను వాడడము ప్రారంభించండి—సూపర్ 777 డెటర్జెంట్ ఉతికే బార్!

shilpi hpma 6A/73 TEL

# డాక్టరు సలహాలు

డాక్టర్ కె. వెంకటేశ్వరరావు

కె. వి. ఆర్. మద్రాసు-

రుమాటిక్ మైట్రల్ వాల్వ్యులర్ డిసీజు అంటే ఏమిటి ? నా వయస్సు 18 సం.లు గత 3 సం.లుగా ఈ రోగం నాకు ఉందని, ఎగశ్వాసవస్తూ ఉండటంవల్ల ఆస్పత్రులకి వెళితే చీటీమీద ప్రతి సారీ వ్రాయటంవల్ల కుతూహలంతో మీ సలహా అడుగుతున్నాను.

మైట్రల్ వాల్వ్యులర్ డిసీజు అనేది హృదయంలోని ఎడమ భాగంలో ఉన్న మైట్రల్ కవాటం [బైకస్పిడ్ వాల్వ్] రోగ గ్రస్తమవటంవల్ల — వాటి రంధ్రం పెద్దదవటమో లేక చిన్నదవటమో జరగడమే ! కవాటాల కూడలిలోని రంధ్రం చిన్నదైతే మైట్రల్ స్టినోసిస్ అనీ పెద్దదయితే మైట్రల్ రీగర్జిటేషన్ అనీ వ్యవహరిస్తారు. ఇలా ఈ రెండు మార్పులవల్ల రక్తప్రసారణలో అవరోధం ఏర్పడటంవల్ల ఆయాసం హృదయ భాగంలో నొప్పి తరచు దగ్గు కఫం, కఫంలో నెత్తురు రావచ్చును. మీరు అడిగిన ప్రశ్నకి ఈ మాత్రం వివరణ చాలనుకుంటాను !

ఆర్. ఎస్. – కుప్పం

నా వయస్సు 25 సంవత్సరాలు దాదాపు సంవత్సరంగా రెండు రొమ్ములు వాస్తూ ఉన్నాయి. ఒకోసారి నెప్పితోబాటే జ్వరం రా[illegible]ం కూడా జరుగుతుంది గత 2 నెలలుగాతరచూ రావటం, వస్తే ఒకవారంపాటు ఉండటం, చాలా బాధగానూ నెప్పిగాను ఉండటం జరుగుతున్నది. కొందరు ఇది కేన్సర్‌కి దారి తీస్తుందేమోనని, ఎక్సరే తీయమన్నారు. దీనికి సలహా చెప్పండి.

రెండు నెలలుగా తరచూ వాపు, నెప్పితో కలసి జ్వరం కూడా రావటం మామరీ గ్రంథులు [రొమ్ములు], ఋతుక్రమ సమయంలో జరిగే సహజ హార్మోనుల హెచ్చు తగ్గుల కట్టుబాట్లు లొంగటం లేదని, తద్వారా సూక్ష్మ క్రిములకి ఆచోటచేరి, వాపు కలిగించటం దానివల్ల జ్వరం నెప్పిరావటం జరుగుతున్నదని నా అభిప్రాయం దీనికి మీకు దగ్గరలో ఉన్న లేడీ డాక్టరును సంప్రదించడం శ్రేయస్కరం యాంటీ బయాటిక్‌లు వాపు తగ్గే మాత్రలు, నెప్పి మొదలయినవాటికి మందులు హార్మోనుల మార్పును సరిచేసే సమయంలోనే వాడటం వల్ల మీకు తప్పక నయమవుతుంది.

వి. ఎస్. ఆర్. నెల్లూరు .

మెలంకోలియా అనే వ్యాధి లక్షణములు తెలియ జేస్తూ ఆ వ్యాధితో బాధపడేవారువైద్యము లేకుండా ఎంతకాలము బ్రతకగలరో తెలుప ప్రార్థన.

మెలన్‌కోలియా అనే మానసిక రోగంఉన్న వారు, మానసికంగా కృంగి, దేనిమీదా శ్రద్ధాశక్తులు లేక, విరక్తిభావం కలిగి ఉంటారు. కొందరికి రోజు మొత్తంలో 2 లేక 3 గం.ల నిద్రమాత్రంఉండటం. కొందరికి సాయం సమయం అసన్నమయేటప్పుడు వారిలోని విరక్తిభావం తగ్గటం త్వరగా ఆలోచించలేక పోవటం, నిర్ణయాలు తీసుకోక పోవటం, తప్పుచేసినట్లు బాధపడటం, తనకు తానుగానే దేనికి పనికిరానని అనుకోవటం, ఆత్మనింద, ఆకలి మందగించటం, ఏ పనీ చేయలేక పోవటం. బరువుతగ్గి శారీరకంగా క్షీణించటం ఈ రోగులకి కనపడే ఇతర లక్షణాలు.

ఈ రోగులు వైద్యం లేకుండా బ్రతకటంసాధ్యం అని అనిపించినా, వాస్తవానికి వారి మనస్తత్వంలో ఉండే క్షణక్షణ మార్పులు వారిని మందులకు,ఎలక్ట్రిక్ షాక్ ట్రీట్‌మెంట్‌లకి బానిసలను చేస్తాయి. మామూలు మనుషులు బ్రతికేకాలం వీరూ బ్రతకటానికి వైద్య సహాయం ఉన్నా లేకున్నా అవకాశం ఉన్నది.

# ప్రేమ నన్ను కొనుక్కుంది






నేను పుట్టిన తరువాత దేనికీ భయపడలేదు!

కానీ పెరిగి పెద్దయింతరువాత ప్రేమని ప్రేమించడానికి భయపడ్డాను! మెల్లగా అలవాటు పడ్డాను ప్రేమకి!

నా పేరు వేణు! ఒక పేరంటూ లేదు లెండి ఎన్నో... ఎన్నెన్నో! రాధ దగ్గర కృష్ణుణ్ణి, మాధవి దగ్గర గోపిని, సీత దగ్గర రాముని, ప్రేమ దగ్గర వేణుని! వాళ్ళంతా పతివ్రతలు కారు. నేను పవిత్రుణ్ణి కాను.

కానీ కథలు చెప్పి కొంత మందిని ప్రతి వ్రతల కింద మార్చి నేను పవిత్రుణ్ణయ్యాను. చివరికి ప్రేమ దగ్గర ఓడిపోయాను.

ప్రేమ గురించి చెప్పేముందు - అంతకు ముందు జీవితంలో జరిగిన కొన్ని విషయాలు నా గురించి తెలుసుకుంటే బాగుంటుందేమో.

అప్పుడు నా పేరు కృష్ణ! పంధొమ్మిది రాని పిన్నవయస్సు నాది. కానీ చాలా విషయాలు అప్పటికే తెలుసుకున్నాను. కాలేజీ జీవితంలోకి అడుగు పెట్టిన నన్ను ఆడపిల్లల అందచందాలు ఆకర్షించేవి. ప్రాయంలో ఉన్న ప్రతీ ఆడపిల్లనీ పరీక్షగా చూసేవాడిని. అది నావీక్‌నెస్! క్లాసులో పాఠం జరుగుతున్నా నా దృష్టి ఆడపిల్లలమీదే ఉండేది అప్పుడు నాకు కామం అంటే నిర్వచనం తెలియదు. కోరికలు మాత్రం కలిగేవి.

'రాధ!' అని ఆ పేరంత అందంగా ఉండే ఓ అమ్మాయి మా క్లాసులో చేరింది. ఆమెను చూసిందగ్గరనుంచి నాలోని కోరికలు పరవళ్ళు తొక్కాయి. ఆమెతో మాట్లాడాలని తపించేవాడిని.

నా స్నేహితులలో చాలా మందికి ఆడపిల్లలంటే భయం. నన్నే పెద్ద హీరో కింద జమకట్టేవారు.

గుండ్రని మొహం! రంగు రంగుల తిలకాలు మారే నున్నని నుదురు. చక్రాల్లాంటి కళ్ళు, నవ్వితే సొట్టలు పడే బుగ్గలు. అందమైన పెదవులు రాధ సొంతం! అవి అన్నీ నా సొంతం చేసుకోవాలనుకున్నాను!

ఓ రోజు ఆ అమ్మాయి 'సైకాలజీ నోట్సు కావా' అని అడిగాను!

'నా సైకాలజీ మీ కర్థం కాదు!' చక్రాల్లాంటి కళ్ళు తిప్పుతూ అంది!

ఆమె ఆ తియ్యని మాటల్లో అర్థాలు వెతికాను.

'మీ పేరు కృష్ణటగా...!' లైబ్రరీలో అడిగింది నన్ను రాధ.

'నా పేరెలా తెలిసింది మీకు...?' ఆశ్చర్యపోతూ అడిగాను.

'నా పేరెలా తెలుసు కున్నారో...అలాగే!' ఎర్రని బుగ్గలు సొట్టలు పడ్డాయి.

'నాతో మాటాడాలని ఇదవుతున్నారటగా...!' మళ్ళీ అదేనవ్వు,

'అవు'నన్నాను నేను.

'సాయంత్రం పార్కులో కలుసుకుందాం. బై!'

హెరాల్డ్ రాబిన్స్ పుస్తకం చేతో పట్టుకుని వెళ్ళిపోయింది.

ఆ సాయంత్రం ఆమెను కలుసుకున్నాను.

అలా ఎన్నో సాయంత్రాలు, పార్కనే బృందావనంలో రాధతో నేను గడిపాను. చాలా సరదాగా మాట్లాడుతుంది. నన్ను ఆడించింది, పాడించింది. ఆమె పొందులో స్వర్గం కనిపించింది నాకు.

'పెళ్ళి చేసుకుందామా?' అడిగిందో రోజు.

గతుక్కుమంది నా మనసు. 'పెళ్ళంటే ఇంట్రస్టు లేదు.' అన్నాను మెల్లగా.

'మరి నన్నెందుకు ప్రేమించావ్...?' ఆమె నుదిటి తిలకం కరిగింది.

'కోరికతో...!' ఎటో చూస్తూ అన్నాను.

'మోసం!' ఆమె బుగ్గలు ఎరుపెక్కాయి. కళ్ళలోకి చూడలేక పోయాను.

'నీ క్కావలసినంత తీసుకో...!' డబ్బు చూపించాను.

'పూర్ ఫెలో! మళ్ళీ నామొహం చూడకు' అని వెళ్ళిపోయింది రాధ.

అమాయకురాలు మళ్ళీ కనిపించలేదు అనుకున్నాను! ఆతరవాత తెలిసింది రాధ చదువుమాని మద్రాసు వదిలి రాజమండ్రి వెళ్ళిందని!

* * *

వాన జోరున కురుస్తోంది! నాలుగ్గోడల మధ్య నేను 'లవ్ నిత్‌ఔట్ ఫియర్' చదువుతున్నాను. 'భయపడకుండా ప్రేమించు' డాక్టర్ ఛేసర్ చక్కగా రాశాడు! పొద్దున్న నాన్నగారి దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. 'నాకు పెళ్ళిచెయ్యాలనుకుంటున్నారు' అన్నది అందులోని సారాంశం!

పెళ్ళంటే నాకు భయం! ఇంకో ఏడాదిలో చదువు పూర్తవుతుంది. ఆతర్వాత ఎంతమందినైనా ప్రేమించొచ్చు! ఉరుములు మెరుపులు! జీవితంలో ప్రేమకూడా అంతే!

మాధవి గుర్తొచ్చింది! మెరుపుల్లో మెరిసి మాయమవుతోంది మాధవి! వారం రోజుల క్రితం ఇలాంటి వానలోనే మాధవి పరిచయమయింది, పాలపొంగులాంటి ఆమె వయసు వానన నన్ను వదిలి పెట్టడంలేదు!

'అరె వానలో తడుస్తూ వెళుతున్నారే..! రండి నేను డ్రాప్‌చేస్తాను!' పాండీ బజార్లో ఆమె పక్కన స్కూటర్ ఆపాను! నిజానికి

# ప్రేమ నన్ను కొనుక్కుంది

నేనూ తడుస్తున్నాను. ఆడపిల్ల కనిపిస్తే నాస్కూటర్ ముందుకెళ్లదు. అది దాని వీక్‌నెస్!

వానలో కూడా మెరుస్తున్న ఆకళ్ళు నావైపు తదేకంగా చూశాయి? అందమైన టెరీన్‌చీర పూర్తిగా తడిసి ఆమె ఎత్తు పల్లాల్ని బహిర్గతం చేస్తోంది. లిప్‌స్టిక్ రాసుకున్న పెదవులు చల్లదనానికి వణుకుతున్నాయి!

ఈ సమయంలో టాక్సీలు, ఆటోలు కూడా దొరకవు.

'ప్లీజ్' అభ్యర్థించాను. అలాంటి సమయాల్లో కాళ్ళు పట్టుకోమన్నా పట్టుకుంటాను.

'ఫరవాలేదు నే వెళతాను' రెండడుగులు ముందుకేసిందామె.

'ఆడవారు ఒంటరిగా వెళ్ళడం అంత మంచిదికాదు.'

మెదలకుండా స్కూటర్ ఎక్కి కూర్చుంది. స్కూటర్ ఉరుముల్ని – మెరుపుల్ని లెఖ్ఖచెయ్యకుండా ముందు కురికింది. ఆమె వెచ్చని శరీరం నావీపుకి తడితడిగా తగులుతోంది.

'మాధవి! బ్యూటిఫుల్ నేమ్!' అన్నాను మైలాపూర్‌లో ఆమెను దించుతూ.

మాధవి! ఏయిర్‌లైన్సులో రిసెప్షనిస్టుగా పనిచేస్తోంది. వయస్సులో నాకంటే కొన్ని ఎక్కువే.

చీర కట్టడంలో స్పెషలిస్టు! కోల మొహం. చిలిపికళ్ళు. చిన్న అధరాలు. పొంగే అవయవాలు.

'మళ్ళీ కలుసుకుందాం' అన్నాను.

'చాలాథాంక్స్' ఆమె వెళ్ళిపోయింది. వానలో వెనొక్కణ్ణే మిగిలాను.

*　*　*

మరుసటిరోజు నేనే వెళ్ళాను ఆమె దగ్గరికి. చిరునవ్వుతో ఆహ్వానించింది.

'బీచ్‌కెళదామా...?' అడిగాను.

'నో అబ్జెక్షన్!' అనుసరించింది.

ఇద్దరం మెరినాకెళ్ళాం. బుహారీ రెస్టారెంట్ కెళ్ళాం. సవేరా హోటల్లో రూమ్ తీసుకున్నాం! ఆమె ఎత్తైన గుండెల్ని నా హృదయానికి హత్తుకున్నాను. ఆమె చేతులు నా నడుమును పెనవేశాయి.

'ఐలవ్‌యూ ...' నా పెదాలు చెప్పలేక చెప్పాయి.

'ఐ లైక్‌యూ...' ఆ కంఠంలో తన్మయత్వం.

మా ఇద్దరి ఊపిరి దగ్గరయ్యింది.

'నిన్ను పెళ్ళి చేసుకుంటాను' నా కంఠం మెల్లగా వణికింది.

'అది అసాధ్యం' నా కురులు సవరించింది ఆమె.

'నే నందంగా ఉండనా?' అడిగాను.

'కాదు. నాకు వివాహం అయ్యింది' తాపీగా ఉంది సమాధానం.

నామీద ఉరుములు–మెరుపులు. నేను పాతాళంలోకి పడిపోతున్నట్లు ఫీలయ్యాను.

'మరి నన్నెందుకు కలిశావు...?'

'వెరైటీ కోసం, వాట్ ఎ హాండ్ సమ్ గయ్ యువార్ గోపీ!' అంటూ దగ్గరకు 'కొక్కో'బోయింది.

'యూ బిచ్!' అరిచాను.

చెంప చెళ్ళు మనిపించి వెళ్ళి పోయింది మాధవి.

మొదటిసారి నేను ఓడిపోయాను.

గదిలో కరెంటు పోయింది. ఆలోచనలు మానేశాను. పుస్తకం మూసి బయటకొచ్చాను వాన వెలిసింది, నాగది నాకు ప్రేమనగర్. చుట్టుపక్కల ప్రశాంత వాతావరణం నాగది ఆరోగ్యానికి మంచి దయ్యింది. అంటే ఆ చుట్టుపక్కల అందమైన ఆడ పిల్లలులేరు. ఈ మధ్య నిద్ర పట్టడం లేదు సరిగ్గా! నిద్ర మాత్రలు మింగటం అలవాటు చేసుకున్నాను.

*   *   *

ఓ సందుంది. ఆ సందులో చాలా మంది అమ్మాయిలు అమ్మకానికి దొరకుతారని విన్నాను. కానీ ఎప్పుడూ అటుగా వెళ్లలేదు. ఆ కోరిక ఇప్పుడు కలిగింది. సినిమాల్లో హీరోయిన్ అయిపోవాలని వచ్చేసి ఎక్స్ ట్రా లైపోయిన కన్నె పిల్లలు పూట గడవక ఒళ్ళమ్ముకోవటంలో ఆశ్చర్యం లేదు!

బ్రోకర్ కామోసు 'సార్ అమ్మాయి కావాలా?' అనడిగాడు.

'అందంగా ఉంటుందా?' అది నా పిచ్చి.

చెయ్యి జాపాడు. ఐదు నోటిచ్చాను. పొంగిపోయాడు.

ఓ ఇంట్లోకి దారితీసి ఏదో మాట్లాడి వచ్చి-'మళ్ళీ మళ్ళీ వస్తారు—వెళ్లండి' దారి చూపించాడు.

లోపలికి అడుగు పెట్టాను. అది నా జీవితంలో మరో తప్పటడుగు. అందంగా ఉందాగది. అంతకన్నా అందంగా ఉన్న ఇరవై ఏళ్ల పడుచు యూఫోం పరుపు పరచిన మంచం మీద కూర్చుని ఉంది.

పైట జారిపుంది. ఆమె కళ్ళు నన్ను భయంగా చూశాయి. అది కావాలని చేసిన పని అని నాకు తెలుసు. తలుపు మూసి దగ్గరకెళ్ళాను.

'కూర్చోండి' సన్నని గొంతు

'నీ పేరు?'

'సీత...'

'నా పేరు రాము!'

చిన్నగా నవ్వింది. తనకి తెలుసు నేను నిజంగా రాముణ్ని కానని.

'నిన్నెదో సినిమాలో చూసినట్టు జ్ఞాపకం!' బుకాయించాను.

'మోసపోయాను!' కళ్లకాటుక కరిగింది.

'ఎవరు చేశారు...?'

'మీలాంటివారే!'

'ఎందుకు పోవాలి?'

మాట్లాడలేదామె! తలలో మల్లెలు వాడిపోయాయి.

'రండి!' అందామె లైటార్పుతూ:

# ప్రేమ నన్ను కొనుక్కుంది

'నువ్వెందుకు మారకూడదు?' చీకట్లోనే అడిగాను.

'చాలాకష్టం! మారటం కాదు — ఇక్కణ్నుంచి తప్పించుకోటం!' ఆమె కనిపించడంలేదు. ఏడుపు వినిపిస్తోంది!

'నాతో వచ్చెయ్యగలవా?''

'మీ పరువు పోతుంది.'

'ఫరవాలేదు. రేపొచ్చి తీసుకెళతాను. సిద్ధంగా ఉండు' వంద రూపాయలిచ్చి అక్కణ్ణుంచి వచ్చేశాను. ఆమె పొందు పొందలేదు.

గదికొచ్చి నిద్ర పట్టక సతమతమయ్యాను. సీతామెను తీసుకొచ్చి ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఆలోచించి చివరికో నిర్ణయానికొచ్చాను. అప్పుడు పట్టింది నిద్ర.

మరునాడు సీతని కొనటానికి బయలుదేరాను. రాత్రంతా అలసి నిద్రపోతోందా సందు. రాత్రి వచ్చిన యింటిని తేలికగానే గుర్తుపట్టాను. ఇంటినిండా జనం మూగున్నారు.

'ఏమయ్యింది?' రాత్రి ఐదునోటు తీసుకున్న మనిషి నడిగాను.

'చచ్చిపోయింది!'

'ఎవరు...?'

'సీత!'

కాలి కింద భూమి కదిలింది. అలుక్కుపోయినట్లు కనిపించారు జనం.

'నా వ్యాపారం పడిపోయింది దేవుడో. దానికేం పోయేకాలమో నిద్ర మాత్రలు మింగేసిందిరో' లోపలినుంచి ఓ స్త్రీ కంఠం వినిపించిది.

అప్పుడు గుర్తొచ్చింది నిన్న నిద్రమాత్రల సీసా యెక్కడో పారేసుకున్న సంగతి; ఆ నిద్ర మాత్రలు నావే. నేనే చంపేశాను సీతని...! ఆమెను కొని రక్షిద్దామనుకున్నాను. నాక్కూడా దొరక్కుండా ఎటో వెళ్ళిపోయింది. ఆమె దేహాన్ని మాత్రం నా డబ్బుతో దహనం చేయించాను.

గదికి తిరిగొచ్చి చాలాసేపు ఏడ్చాను! సీతని మరిచిపోటానికి!

* * *

పరీక్షలవగానే ఇంటికి బయలుదేరాను!

నాలో వచ్చిన మార్పును ఇంట్లో అందరూ పసిగట్టారు. నాన్న నాకు పెళ్ళి కుదిర్చాడు. చేసుకోనని పట్టుబట్టాను. లక్షణమైన సంబంధం-అమ్మ వదలొద్దని గొడవ చేసింది! చేసుకోపోతే నాశనం చూస్తానంది. ఆవిడని కష్టపెట్టటం ఇష్టం లేక నేనా అమ్మాయిని చూడాలన్నాను!

'ప్రేమ'ను చూశాను! భలేపేరు. పేరుకు తగ్గట్టుగానే ఉంది ఆమె అందం! నాకు నచ్చిందో లేదో తెలియదు కానీ మా నాన్న అంతస్తుకు నచ్చింది. ప్రేమ నన్ను కొనుక్కుంది!

ప్రేమ కళ్లలో రాధ, చిరునవ్వులో మాధవి, అమాయకత్వంలో సీత కనిపించారు! ప్రేమని ప్రేమించటానికి భయపడ్డాను! ఆమెకూడా నాకు దూరమౌతుందేమోనని భయపడ్డాను! నానుంచి పారిపోకుండా పసుపు తాడుతో ప్రేమని కట్టేశాను!

## మీకు తెలుసా?

### మన దేశం పంపే రెండవ ఉపగ్రహం

సోవియట్ యూనియన్‌లోని ఒక ఉపగ్రహ స్థావరం నుంచి భారతదేశం మరొక ఉపగ్రహాన్ని అంతరిక్షంలోకి ప్రయోగిస్తుంది. మొదటి ఉపగ్రహం 'ఆర్యభట' ఏడాది దాటినా యింకా రోదసీలో పరిశోధనలు సాగిస్తూ వున్నది.

భారతదేశం ప్రయోగించబోయే రెండవ ఉపగ్రహం బరువు 9,420 కిలోలు. దీన్ని భూమి నుంచి 500 కిలోమీటర్ల ఎత్తున, అర్ధ వృత్తాకార కక్ష్యలో ప్రవేశ పెడతారు.

భూమియొక్క ఉపరితలం యొక్క తత్వం మీదనే యీ ఉపగ్రహం కూడా పనిచేస్తుంది. ఏప్రియల్ 19, 1975 నాడు ప్రయోగింపబడ్డ ''ఆర్యభట''ను పోలినదే యీ ఉపగ్రహం కూడాను. కాని యీసారి యిందులో వుండే శాస్త్రీయ పరికరాలు కొంచెం భిన్నంగా వుంటాయి. ★★★

## ధర్మపథం

ఆంధ్ర సచిత్రవార పత్రికలో ధారావాహికంగా వెలువడుతున్న శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు రచించిన 'ధర్మపథం' శీర్షికలోని కొన్ని అనర్ఘ రత్నాలను ఈ మొదటిభాగంలో యువభారతి [సికింద్రాబాదు] వారు ప్రచురించారు. మతాలు వేరైనా వాటిన్నిటిలోని నీతి, ధర్మాధర్మాలు ఒకటిగానే ఉంటాయి. నీతికి, న్యాయానికీ, ధర్మానికీ మత ప్రసక్తి లేదు. అలాంటి నిరపేక్షమైన ఎన్నో వ్యాసాలు 'ధర్మపథం'లో ఉన్నాయి. అందంగా అచ్చువేసిన 48 పేజీలుగల ఈ పుస్తకం వెల 2 రూపాయలు. చక్కని ముఖచిత్రాన్ని శ్రీ శీలా వీర్రాజు చిత్రించారు. ప్రతులకు : యువభారతి, 5, కింగ్స్‌వే, సికింద్రాబాదు—500003 లేక యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు, తిలక్‌రోడ్, హైదరాబాదు, 500001.

## మన ముఖ్యమంత్రి వెంగళరావు

రచన : శ్రీ తుర్లపాటి కుటుంబరావు. 24 పేజీలు. వెల మూడు రూపాయలు. ప్రతులకు రచయితపేర, లబ్బీపేట, విజయవాడ—520010 వ్రాయాలి.

ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావుగారి బాల్యం, విద్యాభ్యాసం, సాధారణ కార్యకర్తగా ప్రదర్శించిన ధైర్య సాహసాలు, జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడిగా కాంగ్రెసుకు చేసిన సేవ, జిల్లా పరిషత్తు అధ్యక్షుడిగా నిర్వహించిన అభివృద్ధి కార్యక్రమాలు, హోం, పరిశ్రమల శాఖలలో ప్రదర్శించిన కార్యదక్షత, ముఖ్యమంత్రిగా రాష్ట్ర అభివృద్ధిలో సాధించిన విజయాలు ఈ చిన్న పుస్తకంలో రచయిత పొందుపరచారు.

# అవీ - ఇవీ - అన్నీ

## వాణి

కెనడాలోని ఎడ్మన్‌టన్ ఆంధ్ర సాంస్కృతిక సంఘంవారు శ్రీమతి మతుకుమల్లి సుశీలా సుబ్బారావు సంపాదకత్వంలో వెలువరించిన వఉగాది (వార్షిక) సంచికలో మంచికథలు వివిధ విషయాలపై సమగ్ర వ్యాసాలు, చక్కనికవితలు ఉన్నాయి. అక్కడక్కడ వేసిన రేఖా చిత్రాలు, ముగ్గులు కూడ ముచ్చటగాఉన్నాయి 74 పేజీలు ఈ వార్షిక పత్రిక వెల రెండున్నర డాలర్లు ప్రతులకు, రచనలు పంపడానికి ఎడిటర్, 'వాణి', పి. బి 3282, ఎడ్మన్‌టన్, ఆల్‌బెర్టా, కెనడా అన్న చిరునామాకు వ్రాయవచ్చు.

## నవలలు

కథనాయకి వెల : రు. 8 లు పుటలు 252. ఆఓవేణి. వెల 8 రూపాయలు. పుటలు 244. మారని కాలంలో మారిన మనుషులు. రు. 8లు. పుటలు 234. అశోక వనంలో సీత. రు. 7.50లు. పుటలు 208.

ఈ నాలుగు నవలలు కూడా వర్ధమాన నవలా రచయిత్రి శ్రీమతి కురుముద్దాలి విజయలక్ష్మిగారు యిటీవల వివిధ సాంఘిక విషయాలపై వ్రాసినవి. మంచి రంగుల ముఖచిత్రాలతో వీటిని హరి పబ్లికేషన్స్, విజయవాడవారు వేశారు. సోల్ డిస్ట్రిబ్యూటర్స్ న్యూ స్టూడెంట్ బుక్ సెంటర్, ఏలూరు రోడ్డు, విజయవాడ—2.

## కవితాలత

అంతర్జాతీయ మహిళా సంవత్సర సందర్భంగా యువభారతి వనితా విభాగం జరిపిన పోటీలో ఎన్నికైన కవితల సంపుటి 24 పేజీలు, వెల : రూపాయి, ప్రతులకు : యువభారతి, 5, కింగ్స్‌వే, సికింద్రాబాదు—3, లేక యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు, తిలక్‌రోడ్డు, హైదరాబాదు—500001.

## రాష్ట్రస్థాయి అంతర్ కళాశాలల వక్తృత్వ పోటీలు

విజయవాడ కాకరపర్తి భావనారాయణ కళాశాల డిబేటింగ్, క్విజ్ క్లబ్ ఆధ్వర్యాన ఫిబ్రవరి 6వ తేదీ రాష్ట్రస్థాయి అంతర్‌కళాశాల వక్తృత్వపోటీలు నిర్వహించబడ్డాయి. వివిధ కళాశాలల నుండి వచ్చిన 26 టీములు పాల్గొన్నాయి. కార్యక్రమాన్ని శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ప్రారంభించారు. ప్రిన్సిపాల్ శ్రీ ఎస్. సుందరం అధ్యక్షత వహించారు. ప్రథమ బహుమతి : నాగార్జున యూనివర్శిటీకాలేజి, నాగార్జుననగర్, ద్వితీయ బహుమతి : మిసెస్ ఏ. వి. ఎన్. కళాశాల విశాఖపట్నం, తృతీయ బహుమతి మాంటిసోరి కళాశాల, విజయవాడలకు లభించాయి. ఉత్తమవక్త, సి. హెచ్. ఆర్. ఏ. వి. కోటేశ్వరరావు (విశాఖపట్నం) ఉత్తమ ద్వితీయవక్త : ఎస్. నాగేంద్ర రాయ్, నాగార్జున యూనివర్సిటీ, నాగార్జుననగర్, ఉత్తమ స్త్రీవక్త : కె. పద్మం, మాంటిసోరికాలేజి—విజయవాడ. పోటీ కార్యక్రమాన్ని కళాశాల అధ్యాపకులు శ్రీయుతులు కొండముది హనుమంతరావు, సి. రామారావు నిర్వహించారు.

## చలనచిత్రంగా అశాలత నవల

ప్రముఖ నవలా రచయిత్రి తోటకూర అశాలత రచించిన మరొక నవల చలన చిత్రంగా తయారు కానున్నది. 'పచ్చని కలశంలో వెచ్చని కన్నీళ్లు' నవలకు అనిల్ ప్రొడక్షన్స్‌వారు రూపకల్పన చేయనున్నారు. సుప్రసిద్ధ దర్శక నిర్మాత తాతినేని ప్రకాశరావు దీనిని అందించడానికి సన్నాహాలుచేస్తున్నారు.



అలహాబాదులో ఆంధ్ర విజ్ఞాన సమితి వారి ఆధ్వర్యాన సంక్రాంతి వేడుకలు ఘనంగా జరుపుకున్నారు. వైమానిక దళంలో పని చేస్తున్న తెనుగువారు, 'వరుడు కావాలి', 'శ్రీకృష్ణ రాయబారం' నాటకాలను వేశారు. 'వరుడు కావాలి' లో పాల్గొన్న నటులు.



సంక్రాంతి వేడుకల సందర్భంగా బొంబాయి ఆంధ్ర మహాసభ ఆవరణంపై అణుశక్తి ఆంధ్ర అసోసియేషన్ (బొంబాయి) మహిళలు శ్రీమతి పొన్నలూరి పద్మావతి వ్రాసిన 'మరబొమ్మలు' నాటికను 'శ్రీ వాడ్రేవు సుబ్బారావు' దర్శకత్వంలో ప్రదర్శించారు. ఈ నాటికలో నటించిన వారితో దర్శకుడు కూడా ఫోటోలోవున్నారు.

# ఉత్తరాలు

(5వ పేజీ తరువాయి)

...త్రికలోని కథలు చాలా ఆసక్తిదాయకంగా వెలువడినందుకు నాయొక్క ధన్యవాదాలు. ఈవారంలో ''సంఘపురాణం'' మరియు అస్పృశ్యనయనాలు చాలా బాగున్నవి. సంఘ పురాణంలో రంగారావు గారి మాటలు చాలా ఆసక్తిదాయకముగా ఉన్నవి. అస్పృశ్యనయనాలులో సుమలత పాత్రఅభిప్రాయం ఈరోజు ఆడపిల్లల్లో కూడా వుంది. ఈకథ వ్రాసిన వసుంధరకు నాయొక్క అభివందనములు. ఇలాంటి కథలు మన పత్రికలో ప్రచురించిన వారికి నా యొక్క అభివందనములు.

పి.అశోక్ కుమార్ (హైదరాబాదు)

4.2.77 సంచికలో వెలువడిన అస్పృశ్యనయనాలు కథ చదివిన తరువాత మీ [మన]పత్రికకు ఉత్తరము వ్రాయలేకుండా ఉండలేకపోయాను. ఈకథ వ్రాసిన వసుంధరగారికి నా అభివందనములు. దేముడుపంపినమనిషి' కథచాలా చిన్నదిగఉన్నా మంచి కుతూహలంగా ఉంది. రాగతి పండరిగారి ఒకే ఒక కార్టూన్ నన్ను కడుపుబ్బ నవ్వించింది.

చోడిసెట్టి శ్రీనివాసరావు, (కాకినాడ)

*

భవాని ముఖచిత్రంతో వెలువడ్డ 4.2.77 పత్రిక చూడగానే ప్రాణం లేచి వచ్చింది. కథల్లో 'తండ్రిప్రేమ' చాలా బాగుంది.

కపర్తి ప్రదీప్, [సికింద్రాబాదు]

## సీరియల్

11.2.77న ఆంధ్ర సచిత్రవార పత్రిక వాణిశ్రీ ముఖచిత్రం చాలా సింపుల్‌గా వుంది. ''పెళ్ళిచూపులు''కథచాలా బాగుంది. మరి సామాన్యని సణుగుడు శీర్షిక మా కుటుంబానికే నచ్చింది.

## తాజాకలం



ప్రధాని శ్రీమతి యిందిరాగాంధీగారి కుమారుడు శ్రీ సంజయుగాంధీ (31 ఉత్తరప్రదేశ్‌లోని 'అమేథీ' నియోజక వర్గానికి కాంగ్రెసు టిక్కెట్ సంపాదించారు.

ఇన్ క్రెడిబుల్ గాడెస్ సీరియల్ కథ చాలా ఉషారుగా సాగిపోతూంది. ప్రతివార్తలో జరిగే సంవాదాన్ని సమకూర్చి రెడ్డిగారు వడపోసి ఈకథను ప్రేక్షకులకు అందించారు. ''సంఘపురాణం'' కథ చాలా సింపుల్‌గా ఉంది.

''మగదిక్కు'' సీరియల్ కుటుంబంలో జరిగే వివాదాన్ని శాస్త్రిగారు క్షుణ్ణంగా వివరిస్తున్నారు.

రామలక్ష్మిగారి జవాబులు చాలా చురుకుగా సాగుతున్నాయి.

''స్మారెంత'' అనే శీర్షిక పాఠకులకు చాలా బాగా నచ్చింది.

రవీంద్ర భారతి, (అనంత పూర్)




**Printed and Published by S. NageswaraRao at the Andhra Patrika press, MallikarjunaRao Street, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna**

వాడు చాలటం
లేదు! మరోవాడు
పట్రండి, దీనికి
ముడెయ్యాలి!!


పేద కుటుంబంలో
మంచి అందమైన
పదహారేళ్ల పిల్లని
చూడవోయ్
నాకు……..


నేను త్వరలోనే
వివాహం
చేసుకోబోతున్నా
సినీతార


ఇందాక మంగళసూత్ర
ధారణ అయిపో
యిందిగా మళ్లా
ఏమిటీ బాదినా?


ఇందాక ఫోటో
తియ్యటం
మరచి
పోయారట
అంతే!

మాంగల్యానికి
రాగతి
మరోముడి
పండరి



THE INSTITUTE OF ENGLISH STUDIES

ఆంగ్ల భాషాబోధక సంస్థ,
17, మొదటి మెయిన్‌రోడ్డు, లేక్ ఏరియా,
నుంగంబాకం, మదరాసు-600 034
(వళ్లువరుకోటము ప్రక్కన)

Let us together take delight in the TWILIGHT,
the Nature's spectacular impression and expression
of the varied aspects of EDUCATION.



6 ఏండ్ల వయస్సునకు పైబడినవారు

# ఒకే సంవత్సరములో

**ఆంగ్లములో**

**సంభాషించుటకును,**

**పరిచయముచేసికొనుటకును**

**తపాలా ద్వారా**

విశ్రాంతి సమయములో

ప్రారంభమునుండి కాని - లక్ష్యలక్షణ
పరిశోధన పద్ధతిలోకాని

# ఇంగ్లీషు

నేర్చుకోవచ్చును.

ప్రారంభించు క్రొత్త తరగతులగూర్చి నేరుగా వచ్చికాని,
20 పైసల తపాలాబిళ్లతో లేఖను వ్రాసికాని పూర్తి వివరములను
తెలిసికొనండి. వెంటనే చేరండి.

పసిడి కిరణములను ప్రపంచములో
ప్రసరింపజేసి, సముద్రపు పశ్చిమ మట్టముపై పునకు
విశ్రాంతిగొనుటకై త్వరపడు భానునకు, ఆకాశము ఇంద్రధనుస్సుగా మారి,
వేదికవేసి, పాన్పును పరచును. ఇంద్రధనుస్సుయొక్క సప్తవర్ణములు, సంధ్యాసూర్యుని కెంపు వర్ణముతో కలసిమెలసి ఉవ్వెత్తుగా పొంగిపొరలు కడలి అలలనురుగులో కలియును. ఆ రంగుల నురుగుపై తీరమునుచూచు జాలరుల తెప్పలు తేలును. రమ్యమైన రంగులరూపము, కనులకు విందు – ఆరగింప వీలుకాలేదు.

భానునకు విశ్రాంతినిచ్చి, అతనినుండిపొందినకాంతిని ప్రపంచమునకు ప్రతిఫలింప, విహరించు మేఘములకు చంద్రవంక ముందుగా చొచ్చుకొనివచ్చును. కాంతిలోని కొరతను నింపుటకు తారలు దానిని చుట్టుముట్టును. మందహాసమైన సంధ్యాకాంతి కనులకు విందు – ఏకాంతముగానారగింప వీలుకాలేదు.

వెన్నెల వసారానుండి ప్రియునిరాకకై ఎదురుచూచి ఆరాటపడు ప్రియురాలు, మేతపిదప ఇంటికిమరలు గోసమూహము, ఆహారము వెదక వెళ్ళిన తల్లిపక్షికై గూటియందు తల్లడిల్లు గువ్వపిట్టలు, తన జంటను వెదకి అలమటించు ఆడపావురము, తటాకములో రేకులువిప్పి కలువలను ముద్దిడు ముల్లెలు, వికసించిన నవపుష్పములను ఆశించు తుమ్మెదలు, శోభాయమానమగు సంధ్యాసమయము ప్రకృతి ప్రసాదించు మధురామృతము – ఏకాంతముగానారగింప మనసొప్పలేదు! కావుననే మంచి విందును బంధుమిత్రులు చుట్టుముట్ట మిత్రత్వముతో అందరుకలిసి ఆరగింపవలెనని భగవంతుడు ప్రవక్తయైన మహమ్మదుమూలముగా లోకమునకు చాటెనో? విద్య ప్రసాదించు వివేకమనెడి విందును ఒక్కుమ్మడిగా కలిసి రుచిచూచెదము. అందరు రారండు!



G. SHANMUGASUNDARAM